# గొప్పోళ్ళన్యాయం

క్రొవ్విడి లింగరాజు



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

# పాత పరిచయం

సర్కారునౌఖర్లకు ఆదివారం ఆటవిడుపు రోజు. వారంపొడుగునా రోజువారీతంతు ఒక్కటేనాయిరి. ప్రొద్దున్నే లేవడం; కాగితాలు ముందేసుకు కూచోవడం; పదిగంటలు అయీ అవడంతోనే ఉడుకూ మిడుకూ రెండు మెతుకులు ఆదరా బాదరాగా నోట్లో వేసుకుని, యథాశక్తిగా వాహనంలోనో, నడకనో పడి ఆఫీసుకు చేరుకోవడం–ఇంతే. ఆప్యాయంగా ఇల్లాలిచ్చిన తాంబూలాన్ని సేవించడానికి గాని, తిన్న మెతుకులు జీర్ణముఖానికి వొచ్చేదాకా విశ్రాంతిపొందేందుకు గాని వాళ్ళు నోచుకోలేదు. ఆ సౌఖ్యమల్లా ఆదివారంనాడే. వారంలో జరుగవలసిన ఇతర పనులన్నీ ఆనాటికి వాయిదాపడవలసిందే. రోజూ పదిగంటలకు భోజనమైతే అవ్వేళ పండ్రెండుగంటలకు. రోజూ రాత్రితొమ్మిది గంటలకు పడకైతే అవ్వేళ పండ్రెండుగంటలకు పడక, బంధువుల్ని, స్నేహితుల్ని చూడడం మొదలుకొని బజారు చిల్లర పనులవరకు ఆ వేళజరుగవలసిందే. చాకలి, మంగలి పండుగలు

ఆ రోజుకే. అంతేనా? ఎన్నాళ్ళనుంచో వాయిదాలుపడిన కంసాలికూడ ఆ వేళకే. బంగారం వ్యవహారం పిసరంతయినా ఆఫీసరుకు తెలియకపోయినా ఆదివారంనాడు ఆయనఎదుటే అమ్మగారు తూకం తూపించాలి. లోకల్ బోర్డునంబర్లు వకా ల్తీలమీద అటెస్టేషన్ చేసినట్లే అయ్యగారు తూకం కట్టేలు, నమూనా బంగారం పుచ్చుకోవాలి. అబ్బ! ఆదివారం శలవం టారు కాని అంత హడావుడి రోజు అదే. చివరకు ఆ వేళ జర గాలసిన ఇంటిపనులు ఎన్నో వాయిదాలుపడక తప్పదు. అమ్మ గారిచేత కమ్మని మందలింపులూ తప్పవు.

శంకర్రావుపంతులు గుమాస్తాగిరీలోనుంచి జిల్లాముసన సరైన ఉద్యోగస్థుడు. కేవలం కాగితాలకట్టలను భక్తిశ్రద్ధ లతో ఆరాధించినందుకే ఆయనకు ఉద్యోగంలో అభివృద్ధి కలుగుతోంది. అయినా ఆదివారంనాటికి గంపెడు పనులు వాయిదా వేసుకొని బట్టలకొట్టుదగ్గర జట్కాబండిలో కూచు న్నాడు. జట్కాబండిలో కూరగాయలబుట్టతో పాటు సాహు కారు అమ్మగారి ఆమోదంకోసం అలాయిదాగా యిచ్చిన చీరలు, రవికెలతానులు, పరికిణీగుడ్డలు కూడ సర్దుకుంటున్నాడు డఫేదారు సహాయంతో.

"ఏమోయి శంకప్పా" అని పిలుపు వినబడింది.

ఆ పిలుపు వినేసరికి శంకర్రావుపంతులు ఉలికిపడినట్లయి తలెత్తి చూచాడు. ఎదుట అరవై సంవత్సరాల వయస్సుగల పెద్దమనిషి నిలబడ్డాడు. చుట్టుచెంగావి పంచె, హాలెండు చొక్కా

కోటు, లోపల బొత్తాములు లేని కమీజు, చేతిలో చిక్కిపు సంచి, పది జామిపళ్ళు, జాళ్ళుడి జరీ కంగిపోయిన ఉప్పాడ తల పాగ—సాక్షాత్తూ రిటైర్డు నాన్ గెజిటెడు ఉద్యోగస్తుడు ప్రత్య క్షం అయినాడు. శంకర్రావుని శంకప్పా అని పిలిచేవాళ్ళు చచ్చిపోయిన ఆయనతలిదండ్రులు-బ్రతికున్నవాళ్ళలో అన్న గారు మాత్రమే. అంచేత మరీ చకితుడై పోయాడు పంతులు.

"అవునోయి.. ...పెద్ద ఉద్యోగస్తులు మరచిపోరూ. జ్ఞాపకముంటామా మా బోంట్లు,"

శంకర్రావుపంతులుమనస్సు చివుక్కుమంది. చిన్న ఉద్యోగంలోంచి పైకొచ్చిన వాడవడంచేతా, ఇంకా పైకి రాదలచినవాడవడంచేతా తన్ను గురించి ఎవరైన అల్లా అను కుంటారేమోనని ఆయన కనుమానం.

"సరి సరి! ఎంతమాటన్నారు......త..."

"దానికేంలే. ఉద్యోగస్తులకి మరపుసహజమే. అయినా జ్ఞాపకం తెచ్చుకో! ఓయ్! చిన్నప్పుడు నా చేత ఎన్ని దెబ్బలు తిన్నావోయ్. అన్నట్లు రాముడు ఎక్కడవున్నాడు? వాడిని చూచి ఎంత కాలమైందో! ఆయనకీ పెద్ద ఉద్యోగం అయివుం డాలి! అతగాడికి మాత్రం జ్ఞాపకముంటామా! చిన్నప్పుడైతే ఒక కంచంలో తిని ఒక మంచంమీద పడుకున్నాం. కాని ఇప్పుడు ఆ రోజులు జ్ఞాపకముంటాయా? ఇంతకూ అతనికే మైనా తాసిల్దారీ అయిందా?"

అప్రయత్నంగా పంతులు "రామన్నయ్య కడపజిల్లాలో డిప్యూటీకలెక్టరు" అన్నాడు.

"సరి సరి. సంతోషం. పిల్లా మేకా అంతా బాగున్నారా?"

"ఆ, మీ దయవల్ల."

"దానికేం; భగవంతునిదయ. సరి. మీ అమ్మ గంగమ్మత్త బాగుందా......?" అంటూ చేతిలోని చిక్కపుసంచిని బండిచివర ఆన్చేడు.

పంతులు అప్రయత్నంగానే దాన్నందుకుని మిగతా సామాను సర్ది చిక్కానికీ, పెద్దమనిషికీ కూడ చోటు చేశాడు.

"ఈవేళ మంచిరోజు మొత్తంమీద. చాలా కాలానికి నిన్ను చూడడం పడింది. ఎన్నాళ్ళకి ఎన్నాళ్ళకి......ఇప్పుడే పడవదిగొచ్చాను. వస్తూంటే ఒక స్నేహితుడు ప్రస్తావనవశాత్తు ఇల్లా మనశివరావుపంతులుగారి అబ్బాయి శంకర్రావు-- జిల్లా మునసబు వచ్చాడన్నాడు. 'అల్లాగా, శంకప్పా!' అనుకుంటూ, సరే తీరిగ్గా చూద్దామనుకుని మా మేనమామకొడుకుగారింటికి బయల్దేరేను. ఇంతలో ఆడబోయినతీర్థ మెదురైనట్లు బిళ్ళబంట్రోతు కనుపించాడు. ఎంతకాల మైతే ఏమిటి...... చూచి......ఆ పోలికలు ఎక్కడికిపోతాయి! సాక్షాత్తూ శివరావు మామయ్యని చూచినట్లే అనిపించింది నిన్ను చూచేసరికి.

జ్ఞాపక ముంటుందో ఉండదో అని ఆలోచించాను. కాని పూర్వ కాలపువాడిని కనుక ఏమయినా సరేనని సాహసించాను అబ్బాయి......"అంటూ చెబుతున్నాడు.

పంతులు మాట కడ్డొచ్చి—"బండెక్కండి. ఇంటికే వెడదాం. తీరిగ్గా మాట్లాడుకోవచ్చు" అన్నాడు.

"సరే, కానియ్యి......ఏదో చిన్ననాటి ఆప్యాయత వల్ల, పాతకాలంనాటి పల్లెటూరి చుట్టాన్నవడం బట్టి చుట్టరికంగా సిద్ధమవుతున్నాను. మీ యింటావి డేమనుకుం టుందో......" అంటూనే బండిలో ప్రవేశించాడు. డఫేదారు ముందు కెక్కడంతోటే బండి కదిలింది.

బండి నడుస్తున్నంతసేపూ పెద్దమనిషి మాట్లాడుతూనే వున్నాడు. శివరావు పంతులును గురించి, గంగమ్మను గురించి కమ్మని మాటలు చెబుతుంటే ఎన్నిసార్లు లోలోపల అను కున్నా ఆ పెద్దమనిషి పేరడగడానికి పంతులు సాహసించలేక పోయినాడు.

"ఏమి రోజులోయి అవి. అలాంటి మనుష్యులున్నారా ఈ రోజుల్లో అంటాను. ఎక్కడో వేలు విడిచిన మేనమామ మనుమణ్ని స్వంత బిడ్డలా ఆదరించిన శివరావు మామ ధర్మ దేవత కాదుటోయి. అంతకన్నా గొప్పమాట గంగమ్మత్త ఔదార్యం. మహాయిల్లాలు. వాస్తవానికి వాళ్ళవాళ్ళకన్నా నన్నే ఎక్కువగా ఆదరించేది. ఒక్కొక్కప్పుడు నాకు ఇరకాటంగా వుండి 'ఏమత్తా' అంటే 'అవును నాయనా! మా వాళ్ళకి పెట్టినా

పెట్టినట్లే పెట్టకపోయినా పెట్టినట్లే. పరాయి పిల్లవాడికి అసౌకర్యం కలిగితే దక్కుతాయా? సంసారాలు వీధిని పడిపోవూ ......" అన్నట్లు రాముడికి ఎందరు పిల్లలు? సుందరమ్మ బాగుందా? సుందరమ్మభర్త బాగున్నాడా? పిల్లలెందరు? వాళ్ళసంసారం నిండుగా వుంది కదా......అన్నట్లు హెడ్గుమాస్టరుకు వుంటుంటు చేసిన ఆంజనేయులుపంతులుగారి రెండో కూతురు కమలమ్మనే కాదూ నీకిస్తే? అబ్బ! నీ పెళ్ళికి రావడానికి ఎంత ప్రయత్నంచేశానోయి. శుభలేఖలు వ్రాస్తూ, రాముడూ శివరావు మామా కూడా మరీమరీ రమ్మని వ్రాశారు. రావాలని సహస్ర విధాల ప్రయత్నం చేశాను. దిక్కుమాలిన జమాబందీ మాఘమాసంలోనే తగులడుతుంది. ఎన్నివిధాలు తంటాలు. శలవు దొరికిచావందే! ఎప్పటి మాటో......నీకు పిల్లలెందరు అబ్బాయీ?"

"ముగ్గురు. ఇద్దరు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు. ఆడపిల్లలు పెద్దవాళ్ళు. పెద్దదానికి పన్నెండేళ్ళు, చిన్నదానికి పది; కుర్రాడికి ఆరేళ్ళు......"

"సరి! సరి! అయితే పిల్లలు పెళ్ళికి కూడా ఎదిగారన్న మాటే......మరి మీా ఆవిడ వ్రాసుకొంటోందా?"

పంతులుకు ఆపుకోలేని నవ్వు వచ్చింది. పెద్దవాళ్ళకెంత అనుభవమూ అనిపించింది. "క్షమించండి; మరచిపోయాను. తమ నామధేయం?" అని గొంతుకదాకావచ్చిన ప్రశ్న, ఆ పెద్దమనిషి

గ్రుక్క త్రిప్పుకోకుండా చేసినకుశల సంభాషణవల్ల గొంతుక లోనే ఉండిపోయింది.

*   *   *   *   *

జట్కాబండి శంకర్రావుపంతులుగుమ్మంలో ఆగింది. పెద్దమనిషి ముందు దిగేడు. గుర్రపుబండి అలికిడి విని పిల్లలు పరుగెత్తుకుంటూ వీధిలోకి వచ్చారు. డఫేదారు బట్టలు తీయ డంతోటే పిల్లలు 'ఇది నాకు, ఇది నాకు' అంటూ ముట్టడిం చారు. వాళ్ళసంతోషాన్ని చూచి ఆనందిస్తూ పంతులు సిల బడిపోయాడు. పెద్దమనిషి తిన్నగా కచేరీగదిలో సంచి పెట్టి, వంటయింటిముందు భోజనాలశాలలోనికి ప్రవేశించి 'ఏమ మ్మోయి కమలమ్మా' అని కేక వేశాడు. కొత్తగొంతుక కవి పెట్టి 'ఎవరువా'రంటూ గుమ్మంలో కొచ్చి గభాలున వెనక్కి తగ్గింది. ఆ పెద్దమనిషి "కమలమ్మా, అంతసిగ్గుపడక్కరలేదు. నేనేమీ పరాయివాడను కాను. నువ్వు నన్నెరుగవు కాని నేను నిన్నెరుగుదును. చిన్నప్పుడు మీ నాన్న ఆంజనేయులు గారిదగ్గర పనిచేశాను. అప్పుడు నువ్వు చిన్నపిల్లవి. చిన్నప్పు డెన్నోసార్లు నిన్ను ఎత్తుకున్నాను. ఇప్పుడు పెద్దదానవయ్యావు. పిల్లలతల్లివి. పైగా పెద్దఉద్యోగస్తుడి భార్యవు. ఇంతకీ రక్త సంబంధం కల మీఆయనే నన్ను మరచిపోయాడు. అల్లాంట ప్పుడు నీకు జ్ఞాపకంలేకపోవడంలో ఆశ్చర్యం లేదు. అందు కనే నేనే పలకరించాను. ఇంతకీ వేళకానివేళ పట్నవాసంలో చుట్టపాడిని వచ్చాను. అందులోనూ పూర్వకాలపువాడిని. ఏదో కాస్త మడి, ఆచారం కూడాను."

"సరి సరి. ఎంత మాట. చాలా కాలమవడంచేత నే రుగక పోవచ్చునుగాని, పెద్దలు మీరు చెప్పినప్పుడు కూడానా? దయచేయండి. స్నానం చేయండి. ఈవాళ ఆదివారం. అందు చేత నేనూ స్నానంచేసే వంటచేశాను. ఇంకా మాయింట్లో ఆచార వ్యవహారాలు తప్పడం లేదు. పైగా నేను మీ రను కొన్నట్లు అందరిమాదిరి వుద్యోగస్తులభార్య ననుకొన్నా రేమో. మీకే తెలుస్తుంది లెండి. అందులోనూ మీ చుట్ట రికం మాటలావుండగా మా బాబయ్యగారి స్నేహితులా యిరి. బాబయ్యగారివంటివారే మీరున్నూ......"

"అన్నట్లు బాబయ్యగారు కులాసాగావున్నారా?" కమ లమ్మకు గ్రుడ్ల నీళ్లు తిరిగేయి. పమిటికొంగుతో నీరు తుడుచు కొని "బాబాయి పోయి సంవత్సరం దాటిపోయింది" అంది.

"అయ్యో అల్లాగా. నాకు తెలియనే లేదే. ధర్మరాజు నాకెంత సాయంచేశాడు. చూశావా అమ్మా! అందుకే వస్తూ పోతూవుంటేనే చుట్టరికం, స్నేహం అన్నారు పెద్దవాళ్ళు. చూడుమరి, అంతస్నేహంగావుండే ఆంజనేయులుపంతులుగారు పోతే నాకు ఏడాది దాటినా తెలియలేదంటే ఏమనాలి...."

"ఔనండి. అంతే మరి. అందులోనూ బంధుత్వంలో మావారు మరీ యిదండి. ఎప్పుడూ కేసులగొడవే కాని స్నేహితులు, బంధువులు,—ఈ ప్రశంసే లేదు. వేసంకాలం శలవులొస్తే ముందుగా పెద్దప్రోగ్రాంవేస్తారు కాని, తీరా ముందుగా అగ్రహారంవెళ్ళేక అక్కడనుంచి కదలరు. కొబ్బరి

తోట్లో బంగాళే బెంగుళూరు, నీలగిరి అంటారు. పొరుగూళ్ళ లోని బంధువుల నెవ్వరినీ ఎరుగరు. మొన్న ఈమధ్య మా పిన తల్లికొడుకొచ్చి 'బావగారూ' అని పలకరిస్తే నువ్వెవడవని అడిగేసరికి వాడెంతో నొచ్చుకున్నాడు. గుమ్మంలోకి వచ్చిన వాడు వచ్చినట్టుగా వెళ్ళిపోతూంటే నాకు తెలిసి, నేనెంతో బ్రతిమాలినా భోజనానికున్నాడే కాదు. నేనూ ఎన్నో సార్లు చెబుతూనే ఉన్నానండి......"

"సరేలే......కంప్లెయింటు చేయడానికి బంధువు దొరి కేడు......చూడు, పంద్రెండు దాటిింది. భోజనం సంగతి..."

"లేవండి. మీదే ఆలస్యం."



వంటమనిషికూడ ఆదివారం చేయడంవల్ల కమలమ్మే స్వయంగా ఆదరా బాదరాగా చుట్టపాయనపేరిట మరొక కూర చేసింది. నాలుగు రకాల పూరగాయలూ వడ్డించింది. శంకరావు పంతులూ, చుట్టపాయన భోజనంచేస్తున్నంత సేపూ ఆంజనేయులు పంతులుగారిని గురించో, శివరావు మామను గురించో ప్రశంసచేస్తూనే వున్నాడు. దంపతులిద్దరూకూడ ఆ ప్రశంసలతో పరమానందభరితులయ్యేరు. కమలమ్మ పెద్దకూతుర్ని పిలిచి "అమ్మాయీ, తాతగారికి రెండు చక్రకేళీపళ్ళు పట్టుకురా" అని పురమాయించింది.

అమ్మాయి చక్రకేళిపళ్ళు పట్టుకొచ్చి వడ్డించింది. చుట్టపాయన వాటిని స్వీకరిస్తూ—"అమ్మాయి కమలమ్మా!

మరి వరాన్వేషణం జరుగుతోందా మనుమరాలికి? ఈ కాలంలో ఆడవాళ్ళు శ్రద్ధవహిస్తేనే మాట దక్కడం. శంకప్ప శలవుపెట్టి తిరిగితేగాని పని జరగదు...."

"మంచిమాట చెప్పేరు బాబూ. నేనెన్నివిధాల మొగ తెత్తుకుంటున్నా వినిపించుకోవడంలేదు. సుందరమ్మ వదినె కొడుకున్నాడు. వాళ్ళకి కావలసినంతఆస్థి వుంది కాని అబ్బాయికి అట్టే చదువు లేదు. ఉ..."

"ఆరంభించావూ గొడవ ..ఆయన్ని భోజనం చెయ్యనియ్యవూ"

"ఇదే తరహా బాబూ! నే చెప్పితే వేళాకోళం వారికింకా చీమకుట్టడంలేదు. ఇంకా రెండుమూడేళ్ళకు కదా అంటారు."

"అవునమ్మాయీ! ఆయన ఉద్యోగస్తుడు. ఆయన ధీమా అలాంటిది. నువ్వేమో పూర్వకాలపు మనిషివి కనుక ఆదుర్దాపడుతున్నావు..."

" అంతేనండీ........ మరో చక్రకేళీపండు తేవే అమ్మాయీ".

"వద్దమ్మా... చాలు."

"చాలేమిటీ? పిండివంటలా ఏమన్నానా? ఆగంతుకంగా వచ్చారు. ఏమీ చేయడానికి వీలులేకపోయింది—"

"దానికేమిలే. మళ్ళీ రాకపోతానా, నువ్వు చెయ్యకపోతావా... సరి సరి."



భోజనం అయింది. తాంబూలం సేవించి పెద్దమనిషి పడుకున్నాడు. ఫలహారానికి ప్రయత్నంచేస్తోంది కమలమ్మ. చుట్టపాయన కాస్త గుర్రుపెట్టేక శంకర్రావుపంతులు లోనికి వెళ్ళాడు.

"కమలం! ఈయనెవరో నీకేమైనా గుర్తుందా ఏమిః?"

"సరి సరి. మీకు ఒక వేలువిడిచిన మేనమామకొడుకంటూ వుంటే నన్నడుగుతారేమిటి?"

ఆయనెవ్వరో నాకేమీ జ్ఞాపకంరావడంలేదు. ఎంత ఆలోచించినా తోచడంలేదు. కాని ధోరణిచూస్తే ఆయనకు మన అట్లు, పుట్లు, ఆనవాళ్ళు అన్నీ తెలిసున్నట్లు కనుపిస్తున్నాడు. పోనీ, తెగించి పేరడగనా?"

"బాగానే వుంది. అప్రతిష్టకూడాను. అంత దగ్గర చుట్టాన్ని పేరడిగితే ఏమనుకుంటాడు. బాగుంటుందా? మీకంతా మరుపే, బాగా జ్ఞాపకంచేసుకోండి.

"జ్ఞాపకంరావడంలేదే?"

"పోనీండి. మాటలసందర్భంలో ఆయనే చెల్తాడు. నాకు ఆయన్నెప్పుడో చూచినట్లుంది కాని, మరే జ్ఞాపకంలేదు.

ఈ సంభాషణ అయిన కొంతసేపటికి పెద్దమనిషి లేచాడు. కమలమ్మ ఫలహారం, కాఫీ యిచ్చింది. ఆ రెంటినీ ప్రశంసిస్తూ సేవించాడు. ఫలహారం అయిన తర్వాత మళ్ళీ పురాణం ఎత్తుకున్నాడు. మాటలసందర్భంలో అవకాశం చూసుకొని తెగించి "తమ నామధేయం జ్ఞాపకంరావడం

లేదు. కొంచెం శలవిస్తారూ?'' అనడిగేడు చుట్టపాయన్ని పంతులుగారు.

"సరి సరి. చివరికి ఈకాడికొచ్చింది? ఇంటికొస్తే నెత్తి నెట్టుకునే మేనమామకొడుకింటికి వెళ్ళకుండా చిన్ననాటి ఆప్యాయంకొద్దీ ఉద్యోగస్థుడివిగదా అని మన్నించి పిలుపు పట్టుదల పెట్టుకోకుండా యింటికొస్తే, పేరడిగేస్థితికొచ్చింది వ్యవహారం. అమ్మాయీ కమలమ్మా! ఇక నేవెడతానమ్మా. పెద్దవుద్యోగస్థుల వ్యవహారం ఇంతటిదే. నిజానికి నీబోటి ఇల్లాళ్ళు వున్నారు కనుకనే వాళ్ళ మర్యాద యింకా సాగుతోంది.

"ఆయనమాటకేమి లెండి బాబుగారూ......ఉండండి ఈపూటకుకూడా . . ."

"అమ్మాయి. చాలు చాలు, ఇక నేవెళ్ళొస్తా. నీపిల్ల లేరే అమ్మా. ఒక్కసారి చూడనియ్యి" అన్నాడు. పిల్లలు ముగ్గురూ వచ్చి నిలబడ్డారు. ముగ్గురిచేతుల్లోను రెండేసి జామకాయలుపెట్టి, గబగబ కోటుతొడుక్కొని అరుగుదిగేడు. పంతులు మాటాడటంలేదు, లోపలనుంచి గబగబా కమలమ్మ వచ్చేసరికి అప్పుడే చుట్టపాయన గుమ్మందాటేడు.

"బాబుగారూ! బాబుగారూ" అంది కమలమ్మ. ఈసారివచ్చినప్పుడు రెండురోజులుంటాను, అప్పటికి మీ ఆయనకు నాపేరు జ్ఞాపకంవస్తుందేమో"



చుట్టపాయన మళ్ళీరాలేదు. దంపతులు ఎంత తర్జన భర్జనచేసినా ఆయనపేరు జ్ఞాపకంరాలేదు. ఉభయులూ యిది ఘరానామోసంకాదుగదా అనికూడా తర్కించుకొన్నారు.

చుట్టపాయన వెళ్ళిపోయిన చాలారోజులదాకా పిల్ల వాడుమాత్రం "అమ్మా! జామకాయల తాతయ్య మళ్ళీరాడే" అని అడుగుతూనే ఉన్నాడు.

"వస్తాడునాయనా, మళ్ళీఆదివారంవస్తాడు" అంటూనే ఉంది తల్లి.

—

# తీర్పు

"ఏవరండీ అధికారులు ?"

"ఎందుకూ?"

"కేసు రిపోర్టు పుచ్చుకొనేవారు"

"ఏం కేసు?"

"ఖూనీ"

"ఏమిటీ! ఖూనీ కేసూ! ఊ..."

"అవునండి. నేనే ఖూనీ చేసింది!"

"ఎవరిని? ... పెళ్ళాన్ని చంపేవేమిటి?"

"కాదండి ... కొడుకుని ..."

"ఏమిటీ, కొడుకునా?"

సబిన్‌స్పెక్టరు ఉలిక్కిపడ్డాడు. పర్వతంలాంటి మనిషొచ్చి తనంతటతాను నేను నేరస్తుడనని చెప్తుంటే ఇనస్పెక్టరు తెల్లపోవటమేమిటి? నేరందొరికితే తియ్యనీటికి చేపెక్కినట్టు ఉత్సాహపడే పోలీసుఉద్యోగికి మాంద్యంఏమిటి? నిజంగా పారిపోతున్న దొంగను తరుముకెళ్ళి గభాలున మీద

పడి ఒడిసిపట్టుకున్నంత హంగామా చేయవలసిన పోలీసు ఆఫీసరు నెమ్మదిగా లేచి "అరెస్టు చేశాను కూచో" మన్నాడు. తర్వాతి ప్రశ్నలు ఆయనదగ్గరనుంచి రాకుండానే నేరస్తుడు "సందేహించకండి. నేనే చంపేను. కారణం మీకు తెలియ నక్కరలేదు. యిదిగో రక్తం చవిచూచినకత్తి. శవదహన మయిపోయింది." అన్నాడు.

యినస్పెక్టరు విధిలేక చట్టప్రకారం జరుపవలసిన కర్మకాండఅంతా జరిపించడం మొదలుపెట్టాడుకాని, ఆతని హృదయంలో ఏదో ఒకసంకోచం వెనక్కులాగుతూనేఉంది. చేతులకు సంకెళ్లు తగిలిస్తూఉంటే సంకెళ్ళు తనచేతికే బరువుగా కనుపించాయి. ముద్దాయి శరీరాన్ని శోధిస్తుంటే నవనవలాడుతూ వికసించిన గులాబిపువ్వును అకారణంగా నలిపేస్తున్నట్టు వెక్కసపడ్డాడు చీకటిగావుండే ఆ లాకప్‌లో అతన్ని నిర్బంధిస్తుంటే ధర్మదేవతను చీకటికొట్లో వేస్తున్నట్టు కటకటపడ్డాడు. కాని డ్యూటీ...డ్యూటీ...ఇండియన్ పీనల్ కోడ్... అది స్టీముహోలరు.

* * * * *

కొంతస్థిమితపడ్డాక ఇనస్పెక్టరు నేరస్థుని ప్రశ్నించడం ప్రారంభించాడు. నేరాలుకూపీతియ్యడంలో ఉండేనేర్పంతా చూపించాడు. చచ్చిపోయిన పెళ్ళాంకొడుకేమో అనే అనుమానంతో ప్రశ్నలుకురిపించాడు. చేతికందినవయస్సు అవడంవల్ల సరసంలో తండ్రికొడుకు లొకచోట తారసిల్లేరేమోనని

సంశయించాడు. ఎన్నిప్రశ్నలకైనా నేరస్థుడు ఒకటే సమాధానం యిచ్చాడు. "నేను నేరస్థుడిని. నాచేతుల్తో నా కన్న కడుపును కోసుకున్న పాపిని. ఈ ప్రపంచంలో జీవించడానికి నాకు చోటూ లేదు. అర్హతా లేదు. అందుచేత నన్ను శిక్షించండి" అన్నాడు. అల్లామాట్లాడే నేరస్థుడితో వ్యవహారించడం గణపతిరావునాయుడుకు మరింత ఇరుకనిపించింది. లా అంటే మాటలా? చంపినవాడు చంపలేదంటే వూరుకుంటుందా? చంపనివాడు చంపేనంటే వూరుకుంటుందా? పెళ్ళికీ చావుకీ వున్నంతకర్మకాండ జరగాలిసివుండె. నూరుమందికళ్ళఎదుట మనిషిని మనిషి చంపితేనే సవాలక్షగ్రంథం జరగాలసిన లా ఒకమనిషొచ్చి నేను హత్యచేశానంటేమాత్రం ఒప్పుతుందా? కాకపోతే ఇలాంటికేసును ఎన్నడూ చూచిఎరుగనినాయుడుకు మాత్రం ఆశ్చర్యకారణమైంది. నాయుడికే అంతంతగావుంటే జవానులకేమి తెలుసు? వాళ్ళ సంతోషమల్లా ఒక్కటే. ఉచ్చులోపడింది పెద్దపక్షి. అంతే. ఎంతో పనిచెయ్యకపోతే ఇల్లావచ్చి ఇందులో చిక్కుకుంటాడా అనే నమ్మకం.

* * * *

ముద్దాయి రాయన్నగ్రామం విజయేశ్వరం గోపూరు పోలీసుస్టేషనుకు ఎనిమిదిమైళ్ళదూరంలో వుంది. గ్రామమైతే పెద్దదీ, మోతుబరీ రైతాంగం కలదీ. అయినా యీవూరు ప్రయాణానికి సౌకర్యంలేదు. వేసవికాలంలో తప్ప బళ్ళబాట లేదు. మిగతారోజుల్లో కోటీశ్వరుడికైనా కాలినడకే శర

ణ్యాం. అందుచేత ప్రజలు నానాయిబ్బందిపడుతున్నా ఉద్యోగస్తుల తాకీదు తక్కువవడంచేత ఇదే సమయమనుకొని రోడ్డు కోసం ఆందోళనచెయ్యాడంలేదని ప్రతీతి. కొద్దిరోజుల క్రిందటనే గోపురారుస్టేషనుకొచ్చిన నాయుడు తెల్లవారకట్లే లేచి నానా క్షోభా పడి విజయేశ్వరం చేరుకున్నాడు. ఉద్యోగస్థుల తాకిదీ అంతగా ఎరుగని జనం పోలీసుఉద్యోగి వచ్చేసరికి గడబిడపడ్డారు. గణపతిరావు నాయుడు గ్రామచావడిలో మకాం వేసి జవానుకో కబురంపి మునసబును రప్పించాడు. మునసబు రావడంతోనే—

"ఏమయ్యా నీ బకీరు?" అన్నాడు నాయుడు.

"అదేటండోయ్! బకీరా?"

"అవును, ఏమెరుగనట్లు మాట్లాడతా వేం?"

"ఏమండోయి యినస్పెక్టరుగారూ! ఇపరీతంగా సెప్తున్నారే?"

"ఏమయ్యా మునసబూ! అట్టే నటించకు. ఊళ్ళో పలుకుబడి ఉన్నంతమాత్రాన కేసు కమ్మకు చేద్దామంటే సాగదు సుమా. అందులోనూ కూనీ కేసు!"

"కూనీ కేసాండి! మావూళ్ళోనా? అదేటండీ?"

"ఓహో! నంగనాచిలా మాట్లాడుతున్నావు. ఇంతకూ అతనిపలుకుబడి అంతగొప్పదేం? అబ్బాయి! మునసబూ, ఈ పోకడలు కట్టిపెట్టు. నిన్నప్రొద్దున్న మీవూళ్ళో కూనీజరి

గింది. ఈవూరికల్లా నాయకుడట కాదూ ఆ రాయన్న? అంత మాత్రాన్న దాగుతుందనుకోకు. ఆ రాయన్న కొడుకుని కూనీ చేశాడు. మరి.. ''

''అదేటండోయ్ — రాయన్నదొరా! కూనీ! కొడుకుని...'' అని తెల్లబోయాడు మునసబు.

మొదటసందేహపడుతూవచ్చిన ఇనస్పెక్టరుకు ఇందులో ఏదో కుంభకోణముందనే అనుమానం ప్రబలింది.

''ఏమయ్యోయ్ మునసబూ! ఇందులో దాచడానికి యేమీ లేదు. నిన్న ఉదయం రాయన్న తనకొడుకును తాను కూనీ చేసినట్లు ఒప్పుకుని రాత్రి వచ్చి రిపోర్టుయిచ్చి అరెస్టు అయినాడు. ఆ కేసు విచారణ జరపటానికి వచ్చాను. బకీరు రాయకపోతే నీకొంపమీదికివస్తుంది...''

అని ఇంకా చెప్పబోతుంటే మునసబు మాటకడ్డొచ్చాడు. ''ఏమండోయ్ ఇనస్పెక్టరుగారూ! నిజంచెప్తావినండి. రాయన్నదొర అలాంటి మనిషికాడు. బహు పెద్దమనిషి. మా బురదనాటిసీమంతా ఆయనను ధర్మదేవతలా చూచుకుంటాం. నిన్న ఆయనకొడుకు చచ్చిపోయినమాట వాస్తవమే. మేమంతా వెళ్ళి దహనంచేసొచ్చాం. కాని అది కూనీఏమిటండీ? ఆకతాయిముండాకొడుకు ఆ కొడుకు, నానారోగాలు పడి ఒళ్ళుపాడుచేసుకొని చచ్చాడు. వాడిని ధర్మదేవత చంపడమేమిటండీ? ఇందులోఏదోవుంది బాబూ! నిన్న నే జనన

మరణపుస్తకంలో వ్రాశాను. అంతేకాని కూనీకాదండీ బాబూ నమ్మండి!"

ఇనస్పెక్టరు అడ్డొచ్చి "మునసబూ! అదేమిటి ప్రయోజనంలేదోయి. నేరస్తుడే వచ్చి నేరాన్ని ఒప్పుకుంటే నువ్వూ నేనూ గిజగిజలాడితేమాత్రం ఏమి ప్రయోజనం? రాయన్న గోఫ్రారులాకప్‌లో ఉన్నాడు తెలుసా?"

"ఇనస్పెక్టరుగారూ, నమ్మడానికి మనసొప్పటంలేదండి. మాదొర ఖైదీ అవటమేటండి! అలాంటి అల్లరి చిల్లరమనిషి కాడండి.

" అదేమిటోయి ! నీ కెంతచెప్పినా అర్థంకాదేమిటి ? చూడగా చూడగా నీ పీకిమీదికి తెచ్చుకొనేటట్టున్నావు. మాట్లాడక నే చెప్పినట్లు బకీరు వ్రాయి. పద వాళ్ళయింటికి విచారణచేద్దాం"

"ఏం విచారణ బాబూ! ఆ ఇల్లాలి మొహం ఎల్లా చూడడం ఇంతకీ. ఎంత నిర్భాగ్యుడైనా ఒక్కడేకదా కొడుకు. కడుపుదుఃఖంచేత మనిషి కేమైనా మతిభ్రమ కలిగిందేమో యోచించారూ?"

'అలాంటి చిహ్నాలేమీ లేవు. కొంచెం ఆవేశం కనుపించింది. అంతే!'



నాయుడు, మునసబు, నలుగు రైదుగురు పెద్దమనుష్యులు రాయన్న ఇంటి కెళ్ళేరు. పుత్ర శోకంతో మూలబడ్డ అతని భార్య లచ్చమ్మ (అనే లక్ష్మీదేవమ్మ......పోలీసు రికార్డులో) కు రాయున్నకబురు చెప్పేరు. ఒక్కవేటుతో కూలి పోయిన అరటిచెట్టులా కూలిపోయి ఘొల్లుమంది. కొడుకు చావుకు భర్తపాటు తోడై జీవితమంతా అంధకారమైపోయింది. ఈ రెండు బాధలకన్న తెరబయటనున్న పోలీసుఇనస్పెక్టరుప్రశ్న లకు సమాధానంచెప్పేబాధ మరింత ఎక్కువైంది. అప్పటి కప్పుడే నాయుడు ఇంక్వాయిరీలో రాయన్న చాలామంచివాడనీ, సంపన్నగృహస్తుడనీ, చుట్టుప్రక్కల నాలుగైదు గ్రామాల వాళ్ళు అతని ధర్మనిర్ణయానికి బద్ధులైవుంటారనీ తెలిసింది. అందుచేతనే గణపతిరావునాయుడుకు నేరంసంగతి మరింత అగమ్యమైపోయింది. అలాంటి ఘరానామనిషి, తనూ భార్యా అనేక మొక్కులుమొక్కి నలభైయవఏటకన్న కొడుకును-ఎంతో అపురూపంగా పెంచుకున్న కొడుకును——వాడు ఎంత దుర్మార్గుడైతేమాత్రం చేతులార చంపడాని కేం కారణం ఉంది? అందుచేతనే లచ్చమ్మను విచారించడంలో సామాన్యంగా పోలీసుఉద్యోగస్తునిలో అపురూపమైన శాంతాన్నీ, సౌమ్యతనూ తెచ్చుకొని మాట్లాడేడు.

"గోరుచుట్టుమీద రోకటిపోటు దేవుడా!" అంది.

"తెలిసినదంతా చెపితే ఉపకారం జరుగుతుందమ్మా"

"నాజన్మకిక ఒకటే ఉపకారం...ఇంతకీ ఆమహారాజు చంపడమేమిటి కొడుకుని? వాడికర్మానికి వాడేపోయాడు..."

"ఆయనే వచ్చి తనకొడుకుని తానే చంపినట్లు చెబుతున్నాడే మరి?"

"అదేమిటోనాయనా? నాకేమీ తెలియదు. ఆయనల్లా ఎందుకు చెప్పారో! చెట్టంతకొడుకు రాలిపోతే మతిచలించడంలో ఆశ్చర్యమేమిటి! మొండిఘటాన్ని కనుక నేను బ్రతికున్నాను. అయినకర్మమంతా చాలక కోర్టుకుకూడా ఎక్కాలి కాబోలు..."

"తండ్రికొడుకులకేమైనా తగాదాలున్నాయాఏమిటి?"

"అయ్యో రామా! అదికూడానా? నూరునోములు నోస్తే లేక లేక కలిగిననలుసును అపురూపంగా పెంచుకున్నాం. మాప్రారబ్ధంకొద్దీ వాడినడవడి మంచిదైందికాదు. అయినా తండ్రికొడుకులు మాట్లాడుకుంటేగా దెబ్బలాటరావటానికి?"

"ఆవేళ ఏమైనా తగాదాపడ్డారా?"

"అదేమో నాకు తెలియదు. క్రితంరాత్రి ఏడుగంటలకు పడమటివీధి వెంకయ్యగారు, ఇంకా ఎవ్వరో వచ్చి కొడుకుమీద ఆమహారాజుతో ఏదో నేరం చెప్పారు. వాళ్ళ అమ్మాయిని వాడు మోటసరసంచెయ్యబోయాడని కాబోలు! మావాడు అనేకరోజులుగా దుస్సహవాసంపట్టి అన్నివిధాలా పాడైపోయేడు. నాయనా! వారితో ఎన్నోసార్లు మూర్ఖపు

రాలిని నే చెపుతూవస్తే వినుపించుకోలేదు. ఇంటివ్యవహారాలు చూడటానికి వారికి తీరికెక్కడ? ఎప్పుడూ ఊరి వ్యవహారమే అయిరి... పెద్దమనుష్యులు వెళ్ళిపోయిన తర్వాత మాత్రం మామూలుగా భోజనానికి లేవకుండా బెంగపడి కూకున్నారు. ఎన్నిసారులు పిలిచినా లేవలేదు. దానికితోడు తెలివితక్కువదాన్ని నేనుకూడా ఆయన్ని ఒకమాటన్నాను. 'కొమ్మైనప్పుడు వంగకపోతే మాన్నైతే వంగుతుందా? చిన్ననాడు వాడిని అదుపాజ్ఞల్లోపెట్టకపోయి ఇప్పుడు దిగులుపడితే ఏంప్రయోజనం? లేవండి' అన్నాను. ఆ మారాజు కేం కష్టం కల్గిందోమరి, ఎప్పుడూ లేదు — భోజనంచేసి కొడుకోసం చావట్లో అల్లాగా కునుకుతూ కూచున్నారు. కొడుకు రాత్రి తొమ్మిది పదిగంటలకు తూలుతూవచ్చి తిన్నగా తన గదిలోకెడుతుంటే తండ్రి చెయ్యిపట్టుకున్నారు. వాడు విదలించుకొని లోపలికిపోయాండు. లోపలినుంచే భోజనంఅక్కర లేదని ఒక్కకేక పెట్టాడు నాకు. తండ్రికూడా గదిలోకెళ్ళేరు. నేనుకూడా రాబోతే తండ్రి రావద్దన్నారు. కడుపుతీపి ఏడిపించినా ఆడదాన్ని నాకెందుకన్నట్లు వెనక్కొచ్చాను. తండ్రి వాడిని మందలించారు. లాలించారు. కొడుకుకూడా కొంచెం మర్యాదహీనంగా మాట్లాడినట్లు అక్కడక్కడ విన్పించిన ముక్కలవల్ల నాకు తెలిసింది. అప్పటికి రెండురోజుల క్రిందటనే రామన్నపేట నుంచి వాడికి ఇరవై యకరాలు కట్నమిచ్చి పిల్లనిస్తామని వచ్చారు. మారాజు ఏమీ చెప్పలేదు. 'పెళ్ళిఅయితే కుదుట

పడతాడు చెయ్యకూడదా' అని నేనొక ఆడమాటఅన్నాను. 'దానిగొంతుకకూడా కోయ్యాలా?' అన్నారు. మళ్ళీ ఆరాత్రి పెళ్ళిసంగతేదో చెప్పినట్లున్నారు. 'నాకొద్దు. పెళ్ళీవద్దు పెటాకులూవద్దు' అనేమాటొక్కటే నాకు వినిపించింది. నేనెరిగిందంతే. అర్ధరాత్రి ఆయనగారు లేచి కొడుకుగదిలోకి వెళ్ళి, కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ వచ్చి నన్ను లేపి 'అంతా అయిపోయింది. అబ్బాయి చచ్చిపోయాడు.' అన్నారు. నేను గొల్లుమంటూ లేచి గదిలోకి వెళ్ళేసరికి మొగంనల్లబడిపోయి పడున్నాడు కొడుకు. తర్వాత చెప్పడాని కేముంది? నలుగురూ వచ్చారు. ఏడుపులు, పెడబొబ్బలు! నాయనా, కలికాలం. తండ్రిఆపత్తు గడపవలసిన కొడుక్కి తండ్రే చేతుల్తో కొరివెట్ట వలసివచ్చింది. లేక లేక కలిగిన మా సంతానం మూడునాళ్ళ ముచ్చటైపోయింది."

అని ఒక్కసారిగా లచ్చమ్మ బావురుమంది. ఇనస్పెక్టరు హృదయంకూడా కరిగిపోయింది. అతనికి దిక్కుతోచలేదు.



గణపతిరావునాయుడు కధంతా మననంచేసుకున్నాడు. ఊళ్ళోళ్ళధ్యాప్తువల్ల తెలుసుకున్నదానికి లచ్చమ్మకథ కలుస్తోంది. కాని రాయన్న స్టేటుమెంటుకు ఏమీ అందడంలేదు. ఆత్మహత్యే అనే సంశయం కలుగకపోలేదు కాని, రాయన్న ఆ భారాన్ని తనమీాద ఎందుకు వేసుకుంటాడు? కడుపుతీపేకాని

ప్రాణంతీపు మాత్రం తక్కువదా? కాని శాంతుడైనవాడు రేగితే ధర్మరాజుకోపంలాంటిదే కదా. అందులోను పరువు ప్రతిష్ఠలతో బ్రతికేవాడికి కడుపుతీపికన్నా కూడా ఆత్మగౌరవం ఎక్కువై, తాత్కాలికోద్రేకంచేత ఏ కొట్టగానిచోటనో కొట్టివుంటే చచ్చిపోవచ్చును, అని. కథ కలుపుకున్నాడు. ఇందులో వెనుకముందాలోచనలకీ. దయాదాక్షిణ్యాలకీ పరిపూర్ణమైన ఆస్కారమున్నా 'లా' దృష్టిలో వీటికిచోటు లేదు. వ తాచారాల్లో అశుభానికీ శుభానికీ కూడా ఎంతో తతంగం విధిగా నడపవలసినట్లే 'లా' కూడా దానిపంథా నది అవిచ్ఛిన్నంగా నడవవలసిందే. అప్రయత్నంగా రాయన్న నిర్దోషియనీ, అతన్ని తప్పించాలనీ నాయుడు కేదో అభిప్రాయం స్ఫురించేది. కాని పోలీసుఉద్యోగం డ్యూటీ, లా, పీనల్ కోడ్ ఇవన్నీ జ్ఞాపకంవచ్చేసరికి మామూలు వుద్యోగస్థుడయ్యేవాడు. రాయన్నవ్యవహారం చూస్తే ఎంతప్రయత్నించినా కొరుకుపడేటట్టులేదు. లాకప్‌లో ఏదో దీర్ఘాలోచనాతత్పరుడై ఉండడం, ఎన్ని ప్రశ్నలకైనా ఒక్కటే జవాబు చెప్పడం జరుగుతోంది.

"ఎందుకండీ ఈ తర్జన భర్జన? నా కడుపును కోసుకున్న కఠినుణ్ణి......ఎవరికోసం నే బ్రదకాలి? లాప్రకారం శిక్షించి నా బాధ తప్పించండి. మీకెల్లా కావలిస్తే అలా బందోబస్తు చేసుకోండి." అనేవాడు. పైగా వూరివాళ్ళు బంధువులు

ఎందరో చూడడాని కొస్తే ఎవ్వాళ్ళనీ తనదగ్గరికి తీసుకురావద్ద న్నాడు.

ఈ మనిషితో ఏంచెయ్యాడం? కేసు తంతు నడపవల సిందే. దొరికినంత కథను గుదిగుచ్చి పై ఉద్యోగస్థులతో సంప్రదించి కూనీ కేసు బనాయించాడు నాయుడు.



కూనీకేసు తతంగం అంతా నడిచింది. మొదట మేజి స్ట్రేటుఎదుట ఆయన స్టేటుమెంటు రికార్డుచేయడం, మేజి స్ట్రేటుకోర్టులో కొంత తంతునడవడం, మేజిస్ట్రేటు సెషన్సుకు పంపడం జరిగింది. కేసులో ఎన్నిలోపాలుంటే మాత్రం ఏమిటి? ముద్దాయి నేరాన్ని ఒప్పుకుంటున్నప్పుడు కేసులో కష్ట మే ముంది? రాయన్నను సెంట్రలుజైలుకి తీసుకుపోయారు.



సెషన్సుజడ్జి గిరిరావు పంతులుకు పింఛను పుచ్చుకునే కాలమయ్యేసరికి జిల్లా జడ్జి పనైంది. జిల్లా మునసబు ఉద్యో గంలో ప్రవేశించి క్రమంగా ఈ ఉద్యోగాని కొచ్చాడు. మనిషి చాలా శాంతస్వభావుడూ, పాపభీతి కలవాడూ అవడంచేత ఉద్యోగంలో ప్రమోషను కూడా నిదానంగానే వచ్చిందని ప్రతీతి. ముద్దాయిని శిక్షిస్తుంటే ఆ శిక్ష తానే అనుభవిస్తున్నట్లు తహతహలాడేవాడు. ఆ ట్టేకాలం ఉండడు. కనుక హైకోర్టు పూరుకుంది కాని, లేకపోతే ఎన్ని దెబ్బలు తినవలసినవాడో

ఆయనవెవరట రాయన్న విచారణ. పబ్లిక్ ప్రాసిక్యూటరు రావుసాహెబు వెంకయ్యనాయుడు అధికారుల దయవల్ల తొమ్మిది సంవత్సరాలుగా ఆ పని చేస్తున్నాడు. మళ్ళీ మూడు సంవత్సరాలు ఉద్యోగం పొడిగించుకోడానికి ఆత్రపడుతు న్నాడు.

కేవలం అలవాటువల్ల పోలీసు కేసులో తిరుగు వుండ దనీ, చిన్న చిన్న లోపాలున్నా వాటిని సర్దుకోవలసిన పూచీ ప్రాసిక్యూటరుదనే నమ్మకంతో వాదించేవాడు. పోలీసు కేసులో ముద్దాయికి శిక్షపడినప్పుడల్లా తన దివాన్ బహదూర్ ఆద ర్శానికి ఒక మెట్టు సాధించినట్లుగా నమ్మేవాడు. లా యొక్క నిరంకుశత్వంలో అలాంటి విశ్వాసాన్ని ఆయన కుదుర్చుకు న్నాడు. ఇనస్పెక్టరు గణపతిరావు నాయుడు సామాన్యంగా కూనీ కేసుల్లో పోలీసు అధికారులు చూపించే ఉత్సాహాన్ని చూపకుండా ఏదో పోలీసుయంత్రంలో ఒక కీలుగామాత్రమే పనిచేస్తుండడం రావుసాహేబుకు అత్యంత ఆశ్చర్యం కల్గించింది.

ప్రాసిక్యూషన్ సాక్ష్యం మైపోయింది. ముఖ్యసాక్షి గణపతిరావునాయుడే. రాయన్న అంగీకారానికి అనుగుణ్యం గానే ఉంది అతనిసాక్ష్యం. ముద్దాయి వకీలును ఏర్పాటుచేసు కోవడానికి నిరాకరించాడు. అతడుతప్పించుకోదలచుకుంటేగా! జడ్జీపట్టుదలమీద గవర్నమెంటు ఖర్చుతో ముద్దాయితరపున

వకీలు ఏర్పాటైనాడు. అతడుమాత్రం ఏంచేస్తాడు? ప్రాసిక్యూషన్‌లో లోపాలు చూపించగలడుకాని, రాయన్నకు పాఠం చెప్పగలడా? సాక్షివిచారణ ముగిసినతర్వాత జడ్జీ ముద్దాయిని—

"ఏంచెప్తావు? నేరంచేశావా?"

"నేరస్తుడనే."

"మేజస్ట్రేటుఎదుట యిచ్చిన స్టేటుమెంటు ఐచ్ఛికంగానే ఇచ్చావా?"

"ఆ"

"అందులోసంగతులన్నీ నిజమేనా?"

"మార్చడానికేమీ లేదు".

"హత్యకు కారణం ఏమిటి?

"అయిపోయినతర్వాత ఆ విచారమెందుకండీ?"

రాయన్నముఖంలో దీనత్వముంది కాని, అధైర్యం ఎక్కడా కనబడడంలేదు. మానవప్రకృతిని గురించిన తత్వవిమర్శనను ఎంతో అప్పుడప్పుడు గిరిరావుపంతులు చదువుతూ వచ్చాడుకాని, ఈ ముద్దాయివైఖరి తనకు అవగాహనకాలేదు. అయితే యితడు అపూర్వమైన ధర్మమూర్తి కావాలి, లేకపోతే తడిగుడ్డలతో గొంతుకోసి వచ్చినెత్తురుత్రాగే కటికివాడైనా కావాలి. సాక్ష్యంలోనివిషయాలు, ముఖంలోని

దీనత్వం, ధైర్యలక్షణాలు సమన్వయిస్తే రెండవతరహాగా ఆలోచించడానికి ఆస్కారం కనుపించలేదు జడ్జిగారికి.

ప్రాసెక్యూటరు నేరారోపణచేస్తూ వాదించాడు. ముద్దాయిఅంగీకారం, హఠాత్తుగా చచ్చిపోయినవాడిశవాన్ని పరీక్షకు పంపకుండా తనపలుకుబడి నుపయోగించి దహనం చేసెయ్యడం. ముద్దాయి భార్య లచ్చమ్మ స్టేటుమెంటులోని తండ్రికొడుకులతగాదా అన్నీ ముద్దాయిదోషానికి నిర్ధారణలుగా చూపించాడు. హత్యకు కారణం ఏదో ప్రబలమైనది ఉండితీరుతుందనీ ఏ స్త్రీనైనా కారణం కావచ్చుననీ, రాయన్నపలుకుబడివల్ల అలాంటి సాక్ష్యంరావడం అసంభవమనీ వాదించాడు. ఆయన వాదిస్తుంటే రాయన్నముఖంచిట్లించుకుని కటకటపడ్డాడు. ఒళ్ళంతా చీమలు, జెర్రెలు పాకినట్లు చిరాకుపడ్డాడు. శరీరాన్ని సూదుల్తో గుచ్చినట్లు బాధపడ్డాడు. ఈ తతంగం ఎప్పుడైపోతుందా అని తహతహలాడేడు. ఆ తహతహ రావుసాహెబు కేం తెలుస్తుంది? ఎద్దుపుండు కాకికినొప్పా? రాలిపోయినది ముసలిపండైనా, బిడ్డలైనది పచ్చికాయైనా అపరకర్మ చేయించే పౌరోహితుడికి మంత్రతంత్రాలుఒక్కటే. తంత్రప్రకారం గోదాన, భూదాన, సాలిగ్రామదానాలు అడుగుతూ నేవుంటాడు. లా తంత్రంకూడ అలాంటిదే. అది యథావిధిగా సాంగోపాంగంగా నడవవలసిందే. ముద్దాయి పలుకుబడివల్ల కలిగిన లోపాల నాస్కారంచేసుకొని అతన్ని

విడుదలచేస్తే పరగణాలో నేరం హద్దులుమీరిపోతుందని కూడా వాదించాడు రావుసాహెబు.

గవర్నమెంటు ఏర్పాటుచేసిన ముద్దాయివకీలు యథా విధిగా తనధర్మాన్ని నిర్వర్తించాడు. ముద్దాయి నేరాన్ని అంగీకరించినంతమాత్రాన్ని శిక్షార్హుడుకాదనీ, పుత్రశోకంవల్ల మతిభ్రమించి తత్కాలమైన ఆవేశంవల్ల చచ్చిపోయే ఉద్దేశంతో అలాఅంగీకరించివుండవచ్చనీ వాదించాడు. ఇంతకూ ఇలాంటి నేరానికి కారణం ప్రధానమైనదని హైకోర్టుతీర్పులన్నీ చూపించి, అలాంటి ప్రబలకారణం ఏమీ ప్రాసెక్యూషన్ ఋజువుచేయలేదు కనుక సంశయానికి తావుందనీ బ్రిటిష్ చట్టప్రకారం సంశయముంటే ముద్దాయి కనుకూలంగా తీర్పుయివ్వాలనీ చక్కగా వాదించాడు. రాయన్న మహనీయమైన ఒకఆవేశంలోనో, ఒకధర్మవివేచనలోనోపడి ఈనేరాన్ని తననెత్తిపైవేసుకుంటున్నాడనీ, ఈలాంటి బాధ్యత వహించడం అగాధమైనట్టిన్ని భవిష్యత్తులోమాత్రమే గోచరమయే టట్టిన్నీ ఒక మహత్తరమైన నైతిక కారణం ఉంటుందనీ, మామూలు కేసులా దీనిని విచారించకూడదనీ అలా చూచే యెడల భగవంతునికీ, ధర్మానికి అపచారం కల్గుతుందనీ, ఈ బాధ్యత న్యాయమూర్తిదేననీ వాదన ముగించాడు.

ఈ యువకుడికెందుకు తనజీవితం యెడల ఇంతపట్టుదల కలిగిందా అని తెల్లపోయి చూస్తున్నాడు రాయన్న. బాధ్యత తన మీదపెట్టిన ఆఖరువాక్యం విని జడ్జీ నూతనభారంతో

క్రుంగినట్లయినాడు. పబ్లిక్ ప్రాసెక్యూటరు ముద్దాయివకీలు వాదనను హేళనచేస్తూ జవాబుచెప్పాడు. తీర్పుకు కేసు వాయిదా వేశారు.



విచారణ జరుగుతున్నంతసేపూ జడ్జీదృష్టి ముద్దాయి ముఖంమీదనే వుంది. పిసరంతైనా మృత్యుభీతి ఆ ముఖంమీద కనబడడంలేదు. నిండుకుండలా తొణుకూ బెణుకూ లేకుండా వున్నాడు. ఆ కుండలో నిండివున్నది నిజమైన శాంతో లేక దుఃఖమో పరమేశ్వరుడికెరుక. విచారణ ముగిసినప్పటినుండి ఆయనకు ఆందోళన హెచ్చింది. ఇక ఆమనిషిప్రాణం తన చేతిలో వుంది. ప్రాసెక్యూషన్ వాదంలో లోపాలున్నా ముద్దాయిఅంగీకారం బలంగావుంది. డిఫెన్సువకీలు చెప్పిన మహత్తరమైన నైతికకారణం వుండటానికి సావకాశాలున్నాయి. కేవలం ముద్దాయిమాట నమ్మి శిక్షిస్తే ఒకప్రాణం తనచేతిమీదుగా పోతుంది. జైలులో అతనిప్రవర్తన ఎలావుందో తెలుసుకోడానికి జైలు అధికారుల నడిగేడు. రాయన్న ఎప్పుడూ ఏదో ధ్యానంలో వుంటాడనీ, మామూలు కూనీఖైదీలలాగా తన కేసుసంగతి అందరితోనూ చెప్పుకోడనీ, ఎవరికీ ఏవిధమైన శ్రమా యివ్వడనీ జైలుఅధికారులు చెప్పేరు. ఇలాంటి అగాధమైనమనిషియొక్క ఆంతర్యం తనకు ఎల్లా తెలుస్తుంది? కేవలం నిర్జీవమైన పుస్తకముల లానాధారంచేసికొని శిక్షవిధించాల్సి

వస్తే తన చేతిమీదుగా ప్రాణంతీయాలసొస్తుందే. ఈ విచక్షణ చెయ్యకపోతే తాను చేసే న్యాయమేమిటి? ఈవిషయంలో తనకెవ్వరు సహాయంచేస్తారు? ఇలా పరిపరివిధాలుగా జడ్జీ ఆందోళనపడ్డాడు.

జడ్జి మెంటురోజు వచ్చింది. ముద్దాయిని తనప్రైవేటు గదిలోనికి రప్పించాడు. ముద్దాయి ఒంటరిగా ఎదుట నిలబడ్డాడు. జడ్జీ కూచోమని కుర్చీచూపించాడు. రాయన్న చేతులుజోడించి కూచోడానికి నిరాకరించాడు. ఆ మర్యాదకు రాయన్న ముగ్ధుడైనాడు.

జడ్జీ "రాయన్నా! చాలా కేసులు విచారించాను. చాలామంది నేరస్తుల్ని చూచాను. కానీ నీలాంటి నేరస్థుడిని కాని, ఈలాంటి నేరాన్ని కాని చూడలేదు."

ముద్దాయి "చిత్తం."

"నువ్వు నిజంగా ఈ నేరంచేశావా?"

"నేను నేరస్థుడి నేనండి."

"అది కాదోయ్! నువ్వు నీచేతుల్తో నీకొడుకును చంపేవా అంటాను"

"అపరాధం నాదే ప్రభూ".

"మాటకి మాట సూటిగా చెప్పవోయ్!".

" చెప్పడానికేముందయ్యా! నేనే నేరస్థుడిని. " ఈ మాటల్లో ఏదో మడత గోచరిస్తూనేవుంది జడ్జీకి. చివరికి కొంచెం నిస్పృహతో—

"ఏమోయి రాయన్నా! ఈ ప్రశ్నలన్నీ నేను నా ఉద్యోగం హోదాతో వెయ్యడం లేదు. అలా వేస్తే కోర్టులోనే అడుగుదును. నీ ప్రవర్తనలో నాకేదో చిత్రం కనుపించే, ఒక పెద్దమనిషి అడుగుతున్నట్లు అడుగుతున్నాను. అంతే కాదు. నీ విషయమైన సత్యం తెలుసుకోకపోతే అపరాధిని నేనవుతాను."

జడ్జీమాటల్లో సౌజన్యత, అభ్యర్థిత్వం రాయన్నను కరిగించినాయి. బందోబస్తుగా కట్టివేయబడిన దుఃఖానికి కట్లు తెగిపోయినాయి. పాతాళ జలకు గడ్డపార తగిలితే నీరుబికినట్లు దుఃఖం ఉబికి వచ్చింది. కన్నీరు ధారకట్టింది. రాయన్న తలవంచినాడు. గద్గద్వసరంతో "ప్రభూ! ఈదీనుడింత గౌరవానికి, ఇంతటి ఆలనకు అర్హుడు కాడు."

"రాయన్నా! ఆ ప్రసక్తి వదిలెయ్యి. నీ గాథ వున్నదున్నట్లు చెప్పు. నన్ను న్యాయపంథాలోనికి పోనీయకు. ఆపాపం నాకొడిగట్టకు".

ఆమాటలు రాయన్నహృదయానికి తగిలాయి. ఏనాటి క్రిందటనో వదలిపెట్టిన ఆప్తమిత్రుడు తిరిగివచ్చినతృప్తి తోచింది. ఇక తనగుట్టు దాచలేకపోయినాడు.

"ప్రభూ! ఈనిర్భాగ్యునిగాథ నిశ్శేషంగా వినండి. ఇంతటి ఆప్యాయతతోనూ, ధర్మచింతతోనూ తామడిగినప్పుడు చెప్పకపోతే ధర్మం నన్నుమార్షించదు. ఇదివరకుచేసిన నేరం కంటె ఎక్కువవుతుంది."

జడ్జీ మాట్లాడకుండా వింటున్నాడు...

"తమరు చిత్తగిస్తే మాపరగణాలో నేను పెద్దసంసారుల్లో లెక్కండి. మీదయవల్ల పెద్దలిచ్చినదే నూరెకరాలు కొంద్రా, దానితోపాటు తోటా, దొడ్డీ సమస్తం లోటు లేకుండా వున్నాయి. కుటుంబం చాలా సాంప్రదాయమైన కుటుంబమండి. నేనూ పెద్దలప్పచెప్పిన వసతిని వృద్ధిచేస్తూ కుటుంబసాంప్రదాయాన్ని కాపాడుతూవచ్చానండి. నిజానికి ఆ ప్రాంతంలో మంచొచ్చినా చెడ్డొచ్చినా నాచేతిమీదుగా నడుస్తోందండి."

" అవునవును. విన్నాఅదంతా. అందుకే నాకు మరీ చిక్కు వచ్చింది."

"చిత్తం, వాస్తవానికి నాస్వంతవ్యవహారాలు దిద్దుకొనేందుకే తీరుబడివుండేదికాదండి. పబ్లికువ్యవహారాలతోటే రోజంతా సరిపోయేది. ఇంతెందుకు స్వామీ! నా మాటే మాటగా చెల్లిపోయింది ఇన్నినాళ్ళనూ్న. కాని ఇంట్లో మాత్రం ఒక్కలోటుండేది. చాలాకాలంవరకుసంతానం కలుగ లేదండి. భార్య కాపురానికొచ్చిన రెండుమూడు సంవత్సరాలకు ఆ లోటు కనుపించడం ప్రారంభమైంది. ఈలోపాన్ని

గురించిన బాధ మొట్టమొదట మాముసలమ్మతో ప్రారంభమై క్రమంగా నా భార్యకు పాకింది. లోకవ్యవహారాలలో నిమగ్నుడనైన నేను కొంతమొండికెత్తినా అప్రయత్నంగా నాకు ఇదొకలోపంగానే కనుపడి మనస్సుకు బాధకల్గిస్తావుండేది సహజంగా ఇంటివ్యవహారాల్లో ముక్తసరిగావుండే అలవాటువల్ల ఈ బాధను మ్రింగేసేవాడిని. మా ముసలమ్మమాట అలా వుంషెగా ఈ వాంఛ నాకూ, నాభార్యకుకూడా ఆవేదనగా ప రి ణ మిం చిం ది. కాని ఆవిషయమైన ప్రస్తావనచేయడానికిగాని, ఒకరిబాధ ఒకరితో చెప్పుకోవడానికిగాని మేము సాహసించలేదు. క్రమంగా మా జీవితంలో మాంద్యం ఏర్పడిందికాని జీవితం మాత్రం యంత్రవతుగా నడచిపోయింది. నాభార్య అనేకనోములునోచింది. మందులూ, మాకులూ సేవించింది. నేను ఆ ఆవేదన మనస్సును బాధించకుండా వుండాలని లోకవ్యవహారాల్లోనూ, ఏవో ధర్మకార్యాల్లోనూ, నిమగ్నుడనయ్యేవాడిని. ఇలాంటిస్థితిలో నాకు నలభైసంవత్సరాలవయస్సు వచ్చేటప్పటికి మా అదృష్టం పండిందనుకొన్నరోజులు వచ్చాయి. నాభార్య గర్భిణిఅ వ డ ం తటస్థించింది. ఈ శ్వ రు ని కృ ప వ ల్ల నాకు కుమారుడు పుట్టేడు. బ్రహ్మాండమైన సంతోషంతో వుత్సవంచేసుకొని, మాతండ్రి రామయ్యపేరుపెట్టుకొని జన్మసార్థకమైనదని సంతోషించాము. అతిరూపంగా పెంచాము......కుర్రవానికి పదిసంవత్సరాలొచ్చాయి. చదువుకప్పచెప్పేను. అందులో ఏమీ చురుకు కనపడలేదు. చదువుకేమి, బుద్ధిప్రధానంగదా! అదితిన్నగావుంటే అంతేచాలనుకొని సరిపెట్టుకున్నా. కాని

రోజురోజూ అదీ అనుమానంలో నేపడింది. అసలే నాది ముక్త సరిస్వభావం. అందులోనూ లేక లేకకల్గిన ఆ నలుసును గట్టిగా మందలించ లేకపోయాను.

"కుర్రవాడికి పద్దెనిమిదేళ్ళువచ్చాయి. చదువు ఆట్టే అబ్బలేదని లోపల నాకు బాధ వుండేదికాని ఎవరికర్మవాళ్ళది. చదువుకోడానికి నేను అవకాశాలు యిచ్చానుకదా, అంతకంటే నేనేం చెయ్యాను అని సంతృప్తిపరచుకొనేవాడిని. మానాయనెంత చదువుకున్నాడు? నేనెంత చదువుకున్నాను? బుద్ధిప్రధానం అనుకున్నాను. కాని నాఆశలన్నీ విఫలమైనాయి. నీతుం చేచాలనుకున్న ఆశకూడా విఫలమైపోయింది." రాయన్నకు నిస్పృహతో కూడిన వెర్రిదుఃఖం పొంగి మాటాడలేక పోయాడు. కాస్సేపటికి సంబాళించుకున్నాడు.

"నాకొడుకు కొంచెం తాగుతున్నాడనీ, పోకిరీస్నేహాలు పట్టి జూదం, జులాయితనంలోకి దిగేడనీ కర్ణాకర్ణిగావింటూ వచ్చాను. కాని ఎవ్వరూ నాతో మాత్రం చెప్పేవారుకారు. తల్లి ఒకటిరెండుసార్లు 'అబ్బాయి చెడ్డస్నేహాలు చేస్తున్నాడుట. మందలించ'మని చెపుతూవచ్చింది. 'మనబంగారం మంచిదైతేసరి' అని నీళ్ళునమిలేశాను. అప్పుడప్పుడు చూచాయగా మందలించేవాడిని. కొన్నిసార్లు ప్రత్యక్షంగా చెప్పి చూచాను. అంతకంటె చొరవచెయ్యడం నాస్వభావంకాదు. చెయ్యలేకపోయాను. అంతే. తుదకు వాడిదుర్మార్గం బహిరంగంగా చెప్పుకోవడందాకా వచ్చింది. నాపరువుకుకూడా

తాకిడితగిలింది. లోకవ్యవహారాలనుగురించి మాట్లాడుతూ కొందరు 'ఊరందరికీ పంచాంగాలుచెప్పొచ్చు. తనదాకావస్తే తెలుస్తుంది' అని వ్యంగ్యంగా దెబ్బలుకొట్టడం ప్రారంభించారు. మరికొందరు ప్రత్యక్షంగానే 'లోకానికంతకూ చెప్తావునీతులు. నీకొడుకుని సర్దుకోవేం?' అని దెప్పుతూవచ్చారు. అలాంటి రోజున కొడుకుమీద చిరాకుపడడంతప్ప ఏమీచేయలేక పోయినాను. చేసేపదునుకూడా తప్పిపోయిందేమో. అప్పటి కప్పుడే నాపరువు కొన్ని అంతరాలు పడిపోయింది. కొద్ది రోజులక్రిందట కొందరుపెద్దమనుష్యులు నాయింటికొచ్చి నేను నాపలుకుబడిని దుర్వినియోగం చేస్తున్నాననీ, కొడుకును అచ్చోసి ఊరుమీదబడిలిపెట్టేననీ, వాడిప్రవర్తనకు బాధ్యత నాదేననీ ఘట్టిగాచెప్పేరు. అప్పటికప్పుడే వాని ఆకతాయి తనం హద్దుమీరింది. నాకు శరీరం నీరైపోయింది. మాటాడ లేకపోయాను. మానంతో నాఅపరాధాన్ని అంగీకరించాను. నా ప్రారబ్ధాన్ని నిందించుకున్నాను. కొడుకుకోసం ఉబలాట పడినంతకాలంలో పెద్యోవంతుకాలం పట్టలేదు ద్వేషంకల్గ డానికి. కొడుకును గట్టిగా మందలించాను. కాని వ్యవహారం ముదిరిపోయింది. కట్టుతప్పింది. నన్నేధిక్కరించేడు......ఇక నెందుకు?......ఆఖరురోజుకథ చెప్తాను.

"సాయంకాలం ఇంటికొచ్చేసరికి పడమటివీధిపెద్దమనిషి అతి ఆవేశంతోవచ్చి నన్ను అనరానిమాటలన్నాడు. అనడా నికి సబబుంది. పడడానికినేనూ అన్నివిధాలా అర్హుడనైనాను.

ఆయనఆడుబిడ్డను నా నిర్భాగ్యుడు అగౌరవంచేశాడు. వాళ్ళు నలుగురూ మెత్తగా సున్నంలోకి ఎముకలేకుండా వాడిని తన్నేరు. అంతటితో ఆగక వాడిమీద కేసుబనాయించి నాతో చెప్పడానికొచ్చాడు. మరునాడు పోలీసులు వాడిని అరెస్టు చేయడమే తరువాయి. నాయోగ్యత, నాకుటుంబసాంప్రదాయం ఆకాడికొచ్చాయి. వాళ్ళు తీవ్రంగా నన్ను తిడుతుంటే సిగ్గుచేత నేనుభరిస్తే ఇదికూడా వాళ్ళు అపార్థమేచేసుకొన్నారు. నామెత్తదనమే వూరికి ఉపద్రవమని ఎత్తిపొడిచారు. నాశరీరమంతా పోట్లుపొడిచినట్లయింది. హృదయం కుమిలిపోయింది. వాళ్ళను సమాధానపరచి చావడిలో కుర్చీలోపడ్డాను. పొంగి వస్తున్న దుఃఖాన్ని, ఆవేశాన్ని ఆపుకున్నాను. నాభార్య పిలవడానికొచ్చి, నావాలకం గ్రహించింది. జరుగనున్నసంగతి చెప్పేసరికి 'అదునులో అదలించకపోతే ఏమవుతుంది? అనుభవించాలి?' అంది. ఆమెకూడా ఆబాధ్యత నానెత్తినే వేసింది. ఆరాత్రి నాకొడుకు ఇంటికొచ్చేదాకా వాకిట్లోనే కనిపెట్టుకున్నాను. రాత్రి తొమ్మిది, పదిగంటలమధ్య తూలుతూ వచ్చాడు. కళ్ళు జ్యోతుల్లావున్నాయి. నాకేసిచూడకుండానే గబాలున తనగదిలోకి ఒక్క చెంగున దాటేడు. ఒక్కక్షణం నిదానించి లోపలికెళ్ళేను.

"ఏమబ్బాయి! ఏంపనిది!" అన్నాను.

"ఏం?"

"నీకుటుంబసాంప్రదాయమేమిటి? నీఅంతస్తేమిటి?నువ్వు చేస్తున్న పనేమిటి?"

"నేను చేస్తున్న పనేనా? యిప్పుడు చెప్పడానికొచ్చావా? నువ్వు చేసిన పనేమిటి?"

"కళ్ళల్లా ఉన్నాయేం?"

"తాగుడు......"

ధోరణి ముదిరిపోయింది. ఇదివరకెన్నడూ ఇల్లాంటి బహిరంగధిక్కారం లేదు. ఇక అల్లాంటి ప్రశ్న వేస్తే మాట దక్కేటట్టు లేదు.

"సాయంత్రం మేదో అల్లరిజరిగిందటగా?"

"అవును. మామూలు అల్లరే. కొత్తేమిటి?"

"నిన్ను అరెస్టుకూడా చేస్తారుటగా?"

"నన్నెవ్వరూ అరెస్టు చెయ్యలేరు."

"ఏం?"

"ఎవరికీ అందనుగా. మానవమాత్రుడితరంగాదు."

"అబ్బాయీ...ఏమిటి నీకీకర్మం?"

"ఇప్పుడిక మాట్లాడకు...ఇప్పుడు చెప్పి లాభం లేదు. అసలు నువ్వే కారణం నాస్థితికి"

"నేనా? ఏం?"

"ముమ్మాటికీ నువ్వే. నువ్వే."

వాడికంఠంలోంచి ఆమాటలు పిసుగుల్లాపడ్డాయి. ''నేనేంచేశాను? నీకేంతక్కువైంది ... ఇంతకూ నీకర్మం ఇలావుంది..."

"నాకర్మా...అవును. నీకర్మకూడా ఇల్లాగేవుంది... నాకేమీ లోటులేదు...నీ అలక్ష్యమే నన్నింతచేసింది."

నాహృదయం కలుక్కుమంది. అల్లే హృదయం చిక్కబట్టుకుని "నాయనా! నీమంచితినానికి నేనడ్డొచ్చానా?" అని అడిగేను.

"అడ్డుకూడారావాలీ? నాకు తండ్రిసహాయం కావలసిన రోజుల్లో నీకు తీరికలేదు. ఊరివ్యవహారాలన్నీ చక్కదిద్దగలిగావుగాని, నాబ్రతుకు దిద్దలేకపోయినావు. నాకర్మకు నన్ను ఇదివరకు వదిలిపెట్టనే వదిలిపెట్టేవు. ఇకముందూ వదిలిపెట్టు" అని బావురుమనిఏడ్చి తల అటుతిప్పకున్నాడు. ఆ స్థితిలో మాట్లాడి ప్రయోజనంలేదని నేను పొంగుతూన్న దుఃఖాన్ని సంబాళించుకోలేక బయటకొచ్చాను. 'నువ్వే బాధ్యుడవు. నాకర్మానికి నన్నొదిలిపెట్టు' అనేమాట నాచెవుల్లో గింగురుమంటున్నాయి. అప్పుడేకాదు ఇప్పటికీని. ఒక్కర్ఝామైనాక కొంచెంమూలుగు వినిపించింది. ఏమోనని లోపలికెళ్ళి చూచేసరికి గుండె గుభేలుమంది. కుర్రవాడు మరణావస్థలోవున్నాడు. మంచంమీద ఏదో సీసా వుంది. అరవబోతే నోరురాలేదు. నోరుతడబడుతూ, 'నాన్నా, నన్నుశాంతంగా చచ్చిపోనియ్యి,

ఇదే నువ్వు చేసే ఉపకారం. నలుగురినీ పిలిచి నా బ్రతుకు అల్లరిచేయకు. ఒక్క క్షణం......నాకర్మ......నీకర్మ...... కుటుంబాని కింక కళంకం లేదు!' అంటూనే ఒక్క క్షణంలోనే నాచేతుల్లోనే ప్రాణం విడిచాడు. ఇక దాచడానికే ముంది? గొల్లుమని తల్లిని పిలిచాను. ఆమే గొల్లుమని కూలింది కొడుకుమీద. తర్వాత ఏముంది? ఏడ్పులు పెడబొబ్బలు! వాడికోరిక ప్రకారం బ్రతుకల్లరి చేయకుండా నలుగురినీ పిలిచి ప్రొద్దున్నే ఈచేత్తోటే దుమ్ము చేసొచ్చాను." అని బావురుమని ఏడ్చాడు. మాట తోణక లేదు.

అప్రయత్నంగా జడ్జీగారి కంటికొలుకుల్లో నీటిబిందువులు క్రమంగా చేరుకొని చెక్కిళ్ళమీదికి ప్రవహించాయి. ఒక్క క్షణమాగి,

"గాయన్నా! అయితే నువ్వెందుకిలా వచ్చావు? ఈ కేసేమిటి?"

"అయ్యా, చేయవలసిన తంతంతా జరిపించాక ఇల్లు వల్లకాడుగా కనిపించింది. అనుక్షణం 'నువ్వే బాధ్యుడవు! ఊరంతా చక్కపెట్టేవు, కొడుకు బ్రతుకు దిద్దుకోలేకపోయావు,' అనేమాటలు హృదయానికి శూలాల్లా గ్రుచ్చుకొన్నాయి. ఆట్టేఆలోచిస్తే అందులో సత్యమున్నట్లుతోచింది. చిన్నప్పుడు గారాబంచేత, మధ్యకాలంలో తీరికలేక, కొంచెం ముదురు పట్టాక అహంకారంతోకూడిన ప్రతిష్టచేత వాడిబ్రతుకును గురించి పుచ్చుకోవలసినజాగ్రత్త పుచ్చుకోలేదు. చేతులారా

కొడుకుని చంపుకున్నాను. ప్రపంచం అంధకారమైంది. బ్రతుకుమీద సుతలాం ఇష్టం లేదు. నూతిలోనో, గోతిలోనో పడి ప్రాణం పోగొట్టుకోవడానికి అహంకారం, ప్రతిష్ఠ అడ్డమొచ్చాయి! తరువాతిగాథ నే చెప్పనక్కరలేదు. నాకు బ్రతుకు ఒక్కక్షణం ఒక్కయుగంలావుంది. అపరాధిని... నన్ను వదలకండి...నా ఆ వేదనను త్వరలో ముగించండి"... అని సాష్టాంగ నమస్కారంచేశాడు రాయన్న జడ్జీగారికి.



పదకొండుగంటలకు సమావేశం కావలసిన కోర్టు నాలుగు గంటలకు వాయిదా వేయబడింది. ముద్దాయితో జడ్జీ ప్రయివేటుగూములో మాట్లాడే అపూర్వ విషయాన్ని గురించి కోర్టుఆవరణలో కొంత లావాదేవీలు జరిగాయి. నాలుగుగంటలకు జడ్జి ముద్దాయిని నిర్దోషిగా నిర్ణయిస్తూ తీర్పు చెప్పేడు. జడ్జి మెంటులో రాయన్నగాథయావత్తూ ఉదహరించి తనఅపూర్వాచర్యను సమర్థించుకున్నాడు. మామూలుగా విడుదలైన కూనీ కేసు ముద్దాయిల్లాగా రాయన్న ఎగిరి గంతెయ్యలేదు. నిస్పృహ, ఆశాభంగా అతనిముఖంమీద తాండవించినాయి. గుడ్డివాడు తడుముకుంటూ నడచినట్లు డాకు లోనుంచి బయటకొచ్చాడు. ఇల్లు. వాకిలి లేనివాడులాగ శూన్య ప్రపంచంలో పడ్డాడు. కోర్టులో గకరకాల సంచలనం కలిగింది.

గణపతిరావు నాయుడుమాత్రం బ్రతుకుజీవుడాఅని తల తడుముకున్నాడు.



రాయన్న ఎక్కడెక్కడతిరిగి స్వగ్రామం ఎప్పుడెళ్ళేడో ఎవరికీ తెలియదు. ఒకరోజు తెల్లవారేసరికి ఇల్లుతాళం వేసివుంది. లచ్చుమ్మకూడా అంతర్ధానమైపోయింది. తనయావదాస్తికీ ట్రస్టుఏర్పాటుచేసి, దానికి సర్వాధికారాలతో రిటైరుకానున్న జడ్జీ గిరిరావు పంతులును యజమానిగాచేసి, కొడుకుపేరిట 'శ్రీరామశరణాలయం' అనేపేరుతో అనాథబాలబాలికలకు శరణాలయాన్ని స్థాపించవలసిందిగా నిశ్చయించి అందుకు తగిన కాగితాలను సక్రమంగా సృష్టించి వాటిని గిరిరావు పంతులుకు అందచేశాడు. అందులో ఉత్తరోత్తరాకూడా తనపేరు ఎక్కడా రాకుండా నిషేధించుకున్నాడు.



రాయన్న దంపతులజాడ ఎవరికీ తెలియదు కాని అతనేర్పాటుచేసిన శరణాలయం విశేషమైన ఆడంబరం లేకుండా ఆనాళ్ళోనే అవిచ్ఛిన్నంగా సాగుతోంది.

---

# చతురంగయోధులు.

వజీదాలీషా రాజ్యం. లక్నో నగరం పేదసాద అనే వివక్షత లేకుండా భోగవిలాసాల్లో మునిగి తేలుతోంది. ఆటపాటల్లో కొందరూ, నల్లమందు గంజాయి మొదలైన నిషాపదార్థాలతో కొందరూ ఆనందంగా కాలక్షేపం చేస్తున్నారు. జీవితంలో ప్రతిరంగంలోనూ భోగం, విలాసం ఉట్టిపడుతున్నాయి. రాజకీయలోకంలో, సాహిత్యప్రపంచంలో, సాంఘిక వ్యవస్థలో, ఉద్యోగ సద్యోగాల్లో, ఆహారవిహారాల్లో అన్నింటిలోనూ భోగపరాయణత్వం ప్రత్యక్షం. ప్రభుత్వోద్యోగులు విషయలోలురు. కవులు ప్రేమ విరహాలమీద కవితా ప్రభావాన్ని విజృంభింప జేశారు. జీవితావసరాలను సృష్టించే కమ్మరి, కుమ్మరి వగైరా పారిశ్రామికులు అత్తరు, పన్నీరు సురమా, బుక్కా, చందనం, గంధం వగైరా సుగంధ ద్రవ్యాలు తయారు చేయడంలో నిమగ్నులైనారు. అందరి, కళ్ళకూ భోగవిలాసం అనేమబ్బు కమ్మేసింది. లోకం ఏమైపోయినా వీళ్ళకేమీ నిమిత్తంలేదు. కోడిపందేలు, డేగ

పందేలు, జూదాలు అవిచ్ఛిన్నంగా నడుస్తున్నాయి. కొన్ని కొన్ని చోట్ల చతురంగమహాసంగ్రామాలు. ఒక్కటేమిటి? పాదుషా మొదలు ఫకీరువరకూ మూఢపుప్పులూ, ఆరుకాయ లూగా ఉన్నారు. ఈ లాలసత్వం ఎంతవరకెళ్ళిందంటే ఫకీరు కొక పైసా దొరికితే తిండిసామాగ్రి కొనుక్కునేందుకు బదులు నల్లమందో, భంగో సేవించేస్థితిలోవుంది. చతురంగంపాచికలు ఆడడంవల్ల మనుష్యులబుద్ధి వికసిస్తుందనీ, కఠినసమస్యలను పరిష్కరించే సూక్ష్మాలు స్ఫురిస్తాయని వాదిస్తూవుండేవారు జనం. (అలాంటిసాంప్రదాయకులుఇప్పుడూవున్నారనుకోండి.)

అలాంటిస్థితిలో మీర్జాసజ్జాదాలీ, మీర్ రోశన్ ఆలీ, ఇద్దరూ తమ బుద్ధిని రాత్రింబగళ్ళూ ఇలా వికసింప జేశా రంటే ఆశ్చర్యమేముంది? ఇద్దరికీ పెద్దబాపతు జాగీర్లున్నాయి. జీవనోపాధికి తమముకోవాలిసిన అగత్యమేమీ లేదు. ఇంట్లో పూరికే కూచుని చేసేదేముంది? ఈ మిత్రుల దినచర్య ఏమంటే ప్రొద్దున్నే లేచి అల్పాహారం చిత్తగించడం, సావిట్లో తివాచీ పరచడం, చతురంగంపావు లమర్చుకోవడం, అక్కడ నుంచి యుద్ధాని ఉపక్రమించడం, ఎత్తుపై ఎత్తులు వేయడం! ఆపైని రెండుఝాములు కానివ్వండి వాళ్ళకేమీ లక్ష్యమన్న మాటలేదు. వంటయిందని ఇంట్లోంచి కబుర్లు వస్తూనే వుండేవి "వెళ్ళు, వస్తున్నా, పీట వెయ్యమను" అంటూ జవాబులు చెబుతూనే వుండేవాళ్ళు. చివరకు ఆ వంటవాడికి ప్రాణంవిసిగి భోజనంకూడా చావిట్లోకే తెచ్చిపెట్టేవాడు. స్నేహితు లిద్దరూ రెండుపనులూ కలిపే కానిస్తుండేవారు.

మీర్జాసజ్జాదాలీ ఇంట్లో ఎవరూ పెద్దవాళ్ళు లేరు. అందుచేత ఆయన సావిట్లోనే ఈ యుద్ధం సాగుతూవుండేది. ఇంట్లోవాళ్ళకుమాత్రం సుతలాం ఇష్టముండేదికాదు. వాళ్ళ కన్న మాటేమిటి, ఇరుగు పొరుగు నౌకర్లు, చాకర్లు, యీవ న్నెందరికూడా చాలా హేళనగా మాటలాడుతూ వుండేవాళ్ళు. "గొప్ప ఆటరా బాబూ! కొంపనుంచేసేస్తుంది. ఈ వ్యసనంలో తగుల్కోకుండా దేముడు రక్షించాలి కాని లేకపోతే ఎందుకూ పనికిరాకుండా పోతారు. ఇదొక పెద్ద తెగులు" అనుకుంటూ ఉండేవాళ్ళు. మీర్జాబేగం తన భర్తను చివాట్లు పెట్టడానికేమైనా సావకాశం దొరుకుతుందా అని చూస్తూ వుండేది. కాని అవకాశం దొరికేదికాదు. ఆమె లోపల పడుకుండేది. బయటఆటజరుగుతూ వుండేది. రాత్రి ఆమె నిద్రపోయాక మీర్జా లోపల ప్రవేశించేవాడు. బేగం తన కోపాన్ని అప్పుడప్పుడు నౌకర్లమీద తీర్చుకొనేది.

"ఏం! తాంబూలం కావాలంటున్నారా? ఓహో! వచ్చి తీసికొని వెళ్ళమని చెప్పు. భోజనానికే తీరుబడి లేకుండా ఉందేం? భోజనం తీసుకెళ్ళి నెత్తినెయ్యండి. తింటే తింటారు. లేకపోతే కుక్కల కెయ్యండి" అంటూ విసుక్కునేది. కాని ముఖాముఖి కొచ్చేసరికి జావ అయిపోయేది. నోరు పెగిలేదికాదు. ఆమెకు నిజానికి మీర్ సాహెబుపై వచ్చినంత కోపం తన భర్తమీద వచ్చేదికాదు. మీరాజీ భార్య

దగ్గర తన నిర్దోషిత్వాన్ని స్థిరపరచుకోడానికి దోషంఅంతా మీర్ సాహేబు నెత్తిన పారేసేవాడు కాబోలు.

ఒక రోజున బేగంసాహేబుకు తలనొప్పి లంకించుకొంది. ఆమె దాసీని "సాహేబుగారిని లోపలి కోసారి రమ్మని చెప్పు. వైద్యుడి దగ్గర కెళ్ళి కాస్త మందుపట్టుకు రావాలి. త్వరగా వెళ్ళు" అంటూ పంపింది. తీరా దాసి మనిషి వెళ్ళి చెప్పేసరికి మీర్జా "వెళ్ళు. వస్తున్నానని చెప్పు" అన్నాడు. బేగంసాహేబాది అసలే కోపస్వభావం. తనకు తలనొప్పిగా వుంటే భర్త చతురంగమాడుతూ కూచోడమా అనే అహంకారంవల్ల కోపం మరీ ఎక్కువైంది. దాసీతో "పో. మళ్ళీ వెళ్ళి ఆయనగారికి తీరిక లేకపోతే నేనే వైద్యుడి దగ్గిర కెడుతున్నానని చెప్పు" అని సందేశం పంపింది.

మీర్జా మంచిరసకందాయంలో వున్నాడు. రెండే రెండెత్తుల్లో మీర్ సాహేబు ఆట కట్టేటట్టుంది. తెగ విసుక్కుంటూ "ఏం! అంత ప్రాణంకడట్టిందా ఏమిటి? ఇంకేం తరువాయి లేదు?" అన్నాడు.

మీర్ సాహేబు:- ఏమిటయ్యా! లోపలికోసారి వెళ్ళి రాకూడదూ! ఆడవాళ్ళతో వ్యాపారం చాలా సున్నితం సుమా!

మీర్జా:- చిత్తం! అల్లాగే! వెళ్ళకేం! రెండెత్తుల్లో మీ ఆట కట్టు.

మీర్:- అయ్యా! ఆ కబుర్లకేం లెండి? ముందు మీజంతువుల్ని కాసుకోండి, తర్వాత ఆటకదుదురుగాని.

మీర్జా:- ఎందుకూ? ఇదిగో కట్టేసే వెడతాను.

మీర్:- మీరు లోపలికెళ్ళిరండి. అంతవరకూ నే నాడను.

మీర్జా:- వెడతానండే తలనొప్పి కేమిటి పెద్దమందు? నాప్రాణం విసిగించడాని కేదో వంకగాని.

మీర్:- అరే, ఏమవనీ? ఆవిడ సంగతి కనుక్కో తీరాలి.

మీర్జా:- అల్లాగే! కానియ్యండి. ఈ యెత్తెయ్యండి.

మీర్:- వల్లకాదు. మీరు లోపలికెళ్ళండి. ఆమె సంగతి కనుక్కొస్తేగాని నేను మోహరామీద చెయ్యి వెయ్యను.

మీర్జాసాహెబు విధిలేక లోపలికెళ్ళేడు. బేగం సాహెబా మొగం చిట్లించుకుంది. మూలుగుతూ "దిక్కుమాలిన చతురంగమంటే అంత వ్యసనం మీకు. ఇంట్లో వాళ్ళు చస్తున్నాసరే ఆటలోంచి లేవాలనేబుద్ధి తోచనే తోచదు. మీలాంటివాళ్ళు ప్రపంచంలో ఎవరైనా వున్నారా అంట" అంది.

మీర్జా:- ఏం చెప్పను? మీర్ సాహెబు ఎంత చెప్పినా వినడాయె. అతిప్రయత్నంమీద ఆయన్ని వదలించుకొచ్చాను.

బేగం:- అవును. ఆయనకేమీ పనీపాటా లేదు. అంతా తనలాగే అనుకుంటాడు. ఆయనకుమాత్రం పిల్లాజల్లా లేరూ? వాళ్ళనేమైనా వదిలిపెట్టేడా?

మీర్జా:- ఆయనకు మహావ్యసనం. ఆయనిక్కడికొస్తే నేనూ విధిలేక ఆడవలసివస్తోంది.

బేగం:- ఏం? ఆడనని మొహంమీద చెప్పెయ్యకూడదూ?

మీర్జా:- సరిసరి! పెద్దమనిషి. అన్నివిధాలా వయస్సులో, హోదాలో, అన్నింటిలోనూ నాకన్న ఎత్తెక్కువ వాడు కాని తక్కువవాడు కాదు.

బేగం:- అయితే ఆయనకు తగినశాస్తి నేనే చేస్తాను. కోపంవస్తే రానియ్యండి, ఎవరికి భయం? ఏం? మన్నేమైనా పెట్టి పోషిస్తున్నాడా? ఒసే దాశీ! సావట్లో చతురంగం పావులిల్లా పట్టుకురా! మీర్ సాహెబుతో అయ్య యింకా ఆటకు రారనీ, తమరిని శలవు తీసికోమన్నారనీ చెప్పు.

మీర్జా:- ఏయ్, ఏయ్, వద్దు సుమా! అల్లాంటి పొరబాటు చెయ్యకుసుమీ. అయన్ని అవమానంగాని చేస్తావేమిటి? దాసీ! ఆగు. ఎక్కడికి వెడుతున్నావు?

బేగం:- ఏం? దాన్ని వెళ్ళనియ్యరా ఏమిటి? మీరు దానికి అడ్డొస్తే నన్ను చంపుకుతిన్నంత ఒట్టే.......... అయితే, కానివ్వండి. దాన్ని అడ్డుకోట్టేరు కాని, నా కడ్డు రండి చూద్దాం.

అల్లా అంటూనే రివ్వుమని ఆగ్రహంతో బేగం సాహెబా సావట్లో కెళ్ళింది. మీర్జా తెల్లమొగం వేశాడు. బీబీకాళ్ళావేళ్ళా పడ్డాడు. "ఇదిగో, నామాట విందూ! నువ్వాక్కడికెడితే హుస్సేన్‌మీద ఒట్టు. నామీద ఒట్టు" అంటూ బ్రతిమాలేడు. కాని బేగం వినిపించుకోలేదు. సావడి గుమ్మందాకా చరచగ వెళ్ళింది. కాని సరాసరి పరాయి మగవాడి ఎదుట పడటానికి కాస్త సంకోచించింది. సావట్లోకి తొంగిచూచింది. అదృష్టవశాత్తూ సావట్లో ఎవ్వరూ లేరు. మీర్ సాహెబు పావులు అటూఇటూ పడేసి బయటికి వేంచేసి తన నిర్దోషిత్వాన్ని స్థిరపరచుకునేందుకా అన్నట్లు వీధిగుమ్మంలో పచార్లుచేస్తున్నాడు.

ఇంకేముంది? బేగం చెంగుమని సావట్లో కొచ్చింది. పావులు విరజిమ్మేసి నాలిగింటిని వీధిలో పారేసింది. లోపల్నుంచి గభాలున తలుపేసి గొళ్ళెం వేసింది. మీర్ సాహెబు వాకట్లో నుంచుని పావులు బయటపడడం చూచాడు. గాజుల గలగల విన్నాడు. సరే, బేగంసాహెబా అలిగిందని గ్రహించాడు. కిక్కురుమనకుండా ఇంటికి దారితీశాడు.

"చాలా తప్పు సుమా" అన్నాడు మీర్జా భార్యతో.

"తప్పా? ఈసారి ఇక్కడికి రానియ్యండి, చేస్తాను ఆయన పని. నిలబడ్డపాటుగా గెంటిస్తాను.........మీరు చతురంగం ఆడుతో కూచోండి; నేను ఇంట్లో పొయ్యిదగ్గర చాకిరితో తల బ్రద్దలు కొట్టుకుంటూ వుంటాను. ఏం? ఇప్పుడైనా వైద్యుడిదగ్గరకి తీసుకెడ్తారా లేదా? ఇంకా తలనొప్పి బాధగానే వుంది".

మీర్జా ఇంట్లోంచి బయలుదేరేడు. సరాసరి వైద్యుడింటికెళ్ళడానికి బదులు మీర్ సాహెబింటికెళ్ళేడు. జరిగిన యావత్తు కథా వినిపించేడు.

మీర్—పావు లెప్పుడు వీథిలోపడ్డాయో అప్పుడే గ్రహించాను. అందుచేతే వెంటనే పలాయనంచిత్తగించాను. చాలా కోపదారిలా కనుపిస్తోంది. అయితే మీరు ఆమెను నెత్తికెక్కించుకున్నారు. అది అట్టే మంచిదికాదు. బయట మీ రేంచేస్తే ఆవిడ కెందుకూ? ఇంట్లో ఏర్పాట్లు చూడడం ఆమె పని. కాని మిగతా విషయాల్తో ఆమె కేమిసంబంధం?

మీర్జా—ఆ గొడవల్లా వదిలెయ్యండి. ముందు కర్తవ్యం? మన సమావేశం ఎక్కడ?

మీర్—దానికేముంది బ్రహ్మాండం! ఇదిగో పెద్ద లోగిలి. సరే, ఇక్కడే వేద్దాం.

మీర్జా—కాని బేగంసాహెబాకు సమాధానం చెప్ప డం కష్టమే! కొంపలో పడుంటేనే ఇంతపని జరిగిందే, ఇక ఇక్కడ మనం గ్రంథంసాగిస్తే బ్రతకనిస్తుందా?

మీర్—ఏమిటండీమరీ! అరచుకోనియ్యండి. నాలుగు రోజులు రుసరుసమంటుంది; అయిదోరోజున ఆమే సర్దుకొం టుంది. మీరుమాత్రం కాస్త నిదానించండి. అంతే.

## 2

మీరుసాహేబు బేగంకు సాహేబు కొంపకు దూరంగా ఉండడమే ఇష్టం. దాని కేవో కొన్ని కారణాలున్నాయి. అందుచేతనే ఆమె యెప్పుడూ ఆయన చతురంగవ్యసనాన్ని గురించి అంత అడిగేదికాదు. ఇంటికి బాగా ఆలస్యంగా వచ్చి నప్పుడు మాత్రం కాస్త పల్చపల్చగా అంటించేది. ఆ కారణం చేత మీర్ సాహేబు తన యిల్లాలు మహా వినయశీల, గంభీర అనే భ్రమలో పడుండేవాడు. కాని రాత్రింబవళ్ళూ సావిట్లో తివాచీ పరచి చతురంగం ప్రారంభించే సరికి బేగంసాహె బాకు కష్టంకలగడం ప్రారంభమైంది. ఆమె స్వేచ్ఛకు అడ్డం కలిగింది.

నౌకర్లు చాకర్లు కూడా గుసగుసలాడడం ప్రారం భించేరు. ఇంతవరకు పనీపాటా లేకుండా ఈగలు తోలుకుంటూ ఒకచోట పడుండేవాళ్ళు. కొంపలో కెవరొచ్చినా ఎవరు

వెళ్ళినా వాళ్ళ కేగొడవా పట్టేదికాదు. ఇప్పుడు ఎనిమిది ఝాములూ ఒకటే హైరాను. తాంబూలం తెమ్మని ఒకసారీ, మిఠాయి పట్టుకురమ్మని ఇంకోసారీ ఏదో ఎప్పుడూ ఒకటేపని. హుక్కా సంగతి చెప్పనక్కరేలేదు. ప్రేమపీడితుల హృదయాల్లాగా రగుల్తూ ఉండాల్సిందే. బేగంసాహెబా దగ్గర నౌకర్లు గోలపెట్టడం ప్రారంభిచారు.

"అమ్మగారూ! అయ్యగారి చతురంగం మా ప్రాణాల కొచ్చింది. పగలల్లా అటూ ఇటూ పరుగులెత్తేసరికి మా కాళ్ళు బొబ్బలెక్కిపోతున్నాయి. ఒళ్ళు హూనం అయిపోతోంది. ఇదేమి ఆటమ్మా! ప్రొద్దున్న కూచుంటే సాయంత్రమైనా కదలరాయె! ఏదో మనోల్లాసం కోసం రోజుకో గంటో అరగంటో ఎవరైనా ఏదైనా ఆడుకోవడం కద్దుగాని రాత్రింబగళ్ళూ ఆడే ఆట ఇదేమిటి? కానియ్యండి; మేము ఫిర్యాదుకోసం చెప్పడంలేదు. తమ నౌకర్లం. తమ రేమి చెయ్యమంటే అది చేతులుకట్టుకు చేస్తాం. కాని ఈ ఆట మాత్రం కొంపకు ముప్పుతెస్తుంది. ఈ వ్యసనంలో పడ్డవాళ్ళు అయిపూ మచ్చా లేకుండాపోతారు. ప్రమాదం తప్పదు. ఒకళ్ళనుచూచి ఒకళ్ళు చివరకు పేట పేటంతా ఈ గుండంలో పడిపోతారు. ఏలినవారి ఉప్పు తింటున్నాం కనుక ఇంతవరకూ చెప్పుకోవాల్సివచ్చింది. తమరి కీర్తికి కళ్లే కళంకాన్ని విని మనస్సు పట్టలేకపోయాం. తర్వాత మీ యిష్టం."

"అవును, నేను చూస్తూనే వున్నాను. నాకూ ఇష్టం లేదు. కాని ఏమిటి చేయడం? నేను కాదు, ఎవరు చెప్పినా ఆయన వినడు."

ఆ పేటలో ఇద్దరు ముగ్గురు పాతకాలపువాళ్ళుండే వాళ్ళు. వాళ్ళు తమలో "ఇప్పుడేమీ లక్ష్యం ఉండదు. తర్వాత తెలుస్తుంది. మన ధనికుల అవస్థ ఇలా వుంటే మన దేశాన్ని దేవుడు రక్షించాలి, అంతే. మన రాజ్యమే ఈ చతురంగానికి ఎప్పుడో బలిఅయిపోతుంది" అనుకునేవాళ్ళు.

రాజ్యంలో గగ్గోలుపుట్టింది. పట్టపగలు దోపిళ్ళు ప్రారంభమైనాయి. ప్రజలగోడు ఆలించే దిక్కూ, పాలించే దిక్కూ లేదు. గ్రామాల్లోని సర్వసంపత్తినీ, లక్నోకు లాక్కురావడం, ఇక్కడ దాన్నంతా వేశ్యలకూ, త్రాగుడు మొదలైన వ్యసనాలకూ సమర్పించడం జరుగుతోంది. ఇంగ్లీషు కంపెనీ కివ్వవలసిన ఋణం రోజు రోజూ పాపం పెరిగినట్లు పెరిగిపోతోంది. రాజరికం సరియైన బందోబస్తుల్లో లేక పోవడంచేత పన్నులు బకాయీలుపడిపోయినాయి. కంపెనీ తాలూకు రెసిడెంటు తరచు మందలించడం ఆరంభించాడు. కాని, విలాస సాగరంలో మునగానాం తేలానాంగా ఉన్న లక్నో ప్రజలకు చీమకుట్టడంలేదు.

మీర్ సాహేబుచావట్లో నెలల తరబడి చతురంగం సాగుతూనే వుంది. కొత్త నడకలు, వింత ఎత్తులు, వీటిలో నిమగ్నులైనారు స్నేహితు లిద్దరూను. అప్పుడప్పుడు ఆట మధ్య మాటా మాటావచ్చి పౌరుషాలు ప్రజ్వరిల్లి చివరికి ఛీ అంటే ఛీ, తూ అంటే తూ అనుకోవడం దాకా వస్తూవుండేది. కానీ, వెంటనే రాజీపడిపోయి సర్దు కునేవారు. ఒక్కొక్కప్పుడు బలం విరజిమ్మేసి లేచిపోవడం కూడా తటస్థించేది. కాని నిద్రలో ఆ మూలిన్యాన్ని మరచి పోతూఉండేవారు. తెల్లవారడంతోటే మళ్ళీ మీర్ సాహెబుసావట్లో మిత్రులిద్దరూ చతురంగసన్నాహంలో పడుండేవాళ్ళు.

ఒకనాడు స్నేహితులిద్దరూ మంచి ఎత్తులో నిమగ్నులై వుండగా, పాదుషా సైనికోద్యోగి గుర్రంమీద నుంచి గుమ్మంలోదిగేడు. దిగుతూనే "మీర్ సాహేబుగారున్నారా?" అని అడిగేడు. సాహేబులకు ప్రాణా లెగిరిపోయాయి. ఏమి కొంపమీదికొచ్చిందో అని కంగారుపడడం మొదలెట్టేడు. ఎన్నివిధాల ఆలోచించినా కారణం ఆనలేదు. తలుపు గడియ వేసుంది. నౌకరుతో "ఇంట్లో లేడని చెప్పు" అని చెప్పాడు.

సిపా:- ఇంట్లో లేకపోతే ఎక్కడున్నారు?

నౌ:- ఆ సంగతి నాకు తెలియదు. అయినా తమ రొచ్చిన పని శలవిస్తారా?

సిపా:- పని నీకు చెప్పేదేమిటి? మీర్ సాహెబును నిలుచున్నపళంగా తీసుకురమ్మని పాదుషావారి ఆజ్ఞ. సైన్యంలోకి మనుష్యుల్ని చేర్పించాలి. జాగీర్దారంటే వేళా కోళమా! యుద్ధంలో ముందుకు దూకాలి. అప్పుడు తెలుస్తుంది అయ్యగారి పస.

నౌ:- చిత్తం. తమరు దయచెయ్యండి. అయ్యగారితో నేమనవిచేస్తాను.

సిపా:- మనవిచేయడాని కేమీ లేదు. రేపు నేను మళ్ళీ వస్తాను. ఖుద్దున తీసుకురమ్మని పాదుషావారి హుకుం.

సిపాయి వెళ్ళిపోయినాడు. మీర్ సాహేబుగుండెల్లో దడదడ ప్రారంభమైంది. "ఏమిటి కర్తవ్యం" అన్నాడు మీర్జాతో.

మీర్జా:- నాకూడా పిలుపొచ్చిందా కొంప మునిగిందన్నమాటే.

మీర్:- దౌర్భాగ్యం! మళ్ళీ రేపు వస్తానంటూ పోయ్యాడే వీడు!

మీర్జా:- ముప్పే. సందేహమేమిటి?..... యుద్ధంలోకి దూకాలసొస్తే చచ్చే చావే!

మీర్:- ఉందిలే దీనికీ ఒక యుక్తి. ఇంట్లో మనం దొరికితే గదా వాడు తీసుకెళ్ళడం? రేపటినుంచి గోమతి

ఒడ్డున పాడుకొంపల్లో ఒకదానిలో చీకీ పరుద్దాం. అక్కడికి ఎవ్వరికబుగూ అందదు. సిపాయి వస్తాడు; వెళతాడు. అంతే

మీర్జా:- బలేబాగా తోచింది ఊహ. అదే యుక్తి, మరొకటి కన్పించడంలేదు.

ఆ వచ్చిన కొత్తుతో మీర్జాసాహెబు బేగం "బాగా దాడెత్తించావు కాదూ" అంది.

"ఆహా! ఇల్లాంటి మూర్ఖులను నూరుమందిని చిటికెన వ్రేలిమీద ఆడించగలను. వీళ్ళ తెలివితేటలు, ధైర్యం చతురంగంలో ఉపయోగపడ్తున్నాయి. ఇక పొరబాటునకూడా కొంపలో వుండరు" అంటూ వెళ్ళిపోయాడు సిపాయి.

## 3

మర్నాడు భాయీలిద్దరూ మొగాలు దిగాలేసుకుని గుమ్మంలో నిలబడ్డారు. ఒక చిన్న కంబళీ చంకనెట్టుకున్నారు. పాన్‌దాన్ చేత్తోపుచ్చుకొని గోమతిఒడ్డున పాడడిన మసీదుకు ప్రయాణమైనారు. దారిలో పొగాకు, గంజాయి వగైరాలు సమకూర్చుకుని మసీదుకు చేరుకొన్నారు. కంబళీపరచి చతురంగాని కుపక్రమించారు. అంతే. ఇక వాళ్ళకూ బయటి ప్రపంచకానికీ సంబంధమే లేదు. రాజు, త్రోసిరాజు, కట్టు మొదలైన వేవో రెండుమూడు మాటలు తప్ప మారుగొడవే లేదు. యోగీశ్వరేశ్వరులు సమాధిలోనైనా ఇంత ఏకాగ్రంగా ఉండలేరు. రెండు ఝూములు తిరిగి కాస్త ఆకలైతే

దగ్గరలో వున్న ముసలమ్మరొట్టెలదుకాణంలో కాస్త చుంచిమాటచేసుకొని తిరిగి యుద్ధరంగంలో పడేవాళ్లు. తరచు భోజనంధ్యాసకూడ ఉండేదికాదు.

దేశంలోని రాజకీయవ్యవహారాలు భయంకరావస్థలో పడిపోతున్నాయి. నగరంలో గలభా హెచ్చయిపోయింది. కంపెనీసేనలు లక్నోమీదికి చొచ్చుకొస్తున్నాయి. పిల్లామేకలతోసహా జనం గ్రామాలకు పారిపోతున్నారు. కాని మన చతురంగయోధుల కిద్దరకూ చీమచిటుకనడంలేదు. ఇంట్లోంచి వచ్చేటప్పుడు పాదుషాతాలూకు ఉద్యోగస్థుల కండ్లబడకుండా దొంగల్లాగ సందుల్లో గొందుల్లో పడి మెల్లగా మసీదుకు చేరుకొనేవాళ్ళు. సాలుకు వేలకొద్దీ ఆదాయాన్ని యిచ్చే జాగీర్లను ఊరికే కూచుని జీర్ణంచేసుకోవాలని వాళ్ళ సంకల్పం.

ఒకరోజున ఆ పాడుమసీదులో కూచుని చతురంగం ఆడుతున్నారు మిత్రులు. మీర్జాఆట కొంచెం లీటుగావుంది. మీర్ సాహెబు రాజుమీద రాజు చెపుతూ డేకేస్తున్నాడు. ఇంతలో కంపెనీసేనలు లక్నోమీది కొస్తున్నాయి.

మీర్ :- అరెబాబా! ఇంగ్లీషుసేనలొచ్చిపడుతున్నాయే!

మీర్జా:- రానియ్యండి. రాజును తప్పకోండి ముందు. ఇదిగో రాజు.

మీర్ :- కొంచెంఉండవయ్యా! ఇదిగో ఈ మూలకొచ్చేయి సేనలు.

మీర్జా:- తొందరేముంది ? ఇదిగో శాహ !

మీర్ :- ఫిరంగులుకూడ ఉన్నాయే. ఎంతలేదన్నా అయిదు వేలమంది వుంటారు. మంచి జవానులే. మనుష్యుల వైఖరి చూస్తేనే హడలెత్తుతోంది.

మీర్జా:- ఈ వంకలకేంలెండి! ఈ డొంకతిరుగుడు కబుర్లు మరెవరితోనైనా చెప్పండి. ఇదిగో రాజు.

మీర్ :- మీరు చాలా చిత్రమైన మనుష్యులండీ! అక్కడేమో పట్టణంమీద ముప్పొచ్చిపడుతోంది. ఇక్కడ మీకు రాజుతప్ప మరో గొడవ లేదు...........కొంచెం ఈ సంగతికూడా ఆలోచించండి. నగరం ముట్టడైపోతేకొంపకు చేరుకోవడమెల్లాగ ?

మీర్జా:- ఇంటికెళ్ళే వేళ కానియ్యండి ఆలోచిద్దాం. ఇది రాజు! దెబ్బతో ఆట కట్టు.

సైన్యం పదిగంటలవేసరికి వెళ్ళిపోయింది. మన మిత్రులు కొత్తఎత్తు ప్రారంభించారు.

మీర్జా:- ఇవ్వేళ భోజనం ఎల్లాగు ?

మీర్ :- ఉపవాసమే. మీకేమైనా ఆకలిగా వుందా?

మీర్జా:- అదికాదు. ఊళ్ళో ఏమవుతోందో మరి.

మీర్ :- ఊళ్ళో ఏమవుతుంది ? ఏమీకాదు. అంతా భోజనంచేసి విశ్రాంతిగా మంచాలమీద దొర్లుతుంటారు. నవాబుగారు కేళీమందిరంలో ఉండిఉంటారు.

చతురంగం ఎత్తుమీద ఎత్తేసరికి మూడుగంటలయింది. మిర్జాజీఆట నీరసంగా పడిపోయింది. నాలుగు గంటలు కొడుతుండేప్పటికి ఇంగ్లీషుసేనలు తిరిగొస్తున్నాయి. అదే కోలాహలం వినిపించింది. వజీదాలీషా పట్టుపడ్డాడు. కంపెనీసేన లాయన్ని ఎక్కడకో తీసుకుపోతున్నారు. నగరంలో ఏవిధమైన ఆందోళనా, పోరాటం కనబడడంలేదు. ఒక్క రక్తపుచుక్క నేలబడలేదు. ఇంతవరకూ ఏ స్వతంత్రరాజుయొక్క పతనం కూడా ఇంత రక్తపాతరహితంగా జరిగివుండలేదు. ఇందుకు కారణం ముక్కోటిదేవతలూ హర్షించే అహింసాదీక్ష కాదు. కేవలం పిరికితనం; కల్తీలేని పిరికితనం. అయోధ్యవంటి విశాల దేశానికి నవాబుగానున్నవాడిని ఖైదుచేసి పట్టుకుపోతుంటే 'కిం' అనేవాడు లేడు. లక్నో సుఖంగా భోగనిద్రలోపడుంది. రాజకీయపతనానికి ఇంతకన్న అధోగతి వుండదు.

మిర్జా:- ఏమండోయి, నవాబుగారిని శత్రువులు ఖైదీగా పట్టుకుపోతున్నారు.

మీర్:- పట్టుకెళ్ళనివ్వండి......ఇదిగో రాజు.

మిర్జా:- ఏమిటండీ! కొంచెం నిదానించండి. మనస్సిక్కడ నిలవడంలేదు. పాపం! నవాబు గొల్లున గోలపెట్టి వుంటాడు.

మీర్:- ఏడ్చే వుండాలి! ఈ భోగం అక్కడెక్కడ నుంచి వస్తుంది?......ఇదిగో రాజు.

మీర్జా:- ఎవడికీ రోజులన్నీ ఒక్కగతిగా వెళ్ళవు కదా!......దిక్కుమాలినజీవితం.

మీర్:- అంతే. అవును...ఈసారి కాచుకోండి. రాజు! ఇంకో ఎత్తులో ఆటకట్టు.

మీర్జా:- ఓయి నీరాజు దొంగలుదోలా! నీ వెంత తినుడవయ్యా? అలాంటిఘోరం చూస్తూంటే దుఃఖంరావడం లేదూ? అయ్యో! పాపం! వజీదాలీ!

మీర్:- అయ్యో! ముందు మీ పాదుషాను రక్షించుకోండి, తర్వాత ఆ పాదుషాగతి ఆలోచిద్దురుగాని...ఇదిగో రాజు......ఆటకట్టు.

నవాబును పట్టుకొని సేన కళ్ళముందరనుంచి వెళ్ళిపోయింది. మీర్జా మళ్ళీ బలం అమర్చాడు. ఓటమి మనస్సును కుమిలించేస్తోంది

"సరే, రండి, నవాబు పరాజయానికి ఒక్క ఏడుపు ఏడ్చేశాంగా?" అనేశాడు. మీర్జా రాజభక్తి తన పరాజయంలో లీనమైపోయింది. తన ఓటమికి ప్రతీకారంచేయాలనే ధృఢ సంకల్పంలోపడ్డాడు.

## 4

సాయంకాలమైంది. ఆపాడుగడ్డల్లో నక్కలుకూయడం ఆరంభించాయి. గబ్బిలాలు తనుతమ గూళ్ళలో చేరుకుంటున్నాయి. ఇద్దరు చతురంగయోధులున్నూ అతి పట్టుదలతో ఆడుతున్నారు. ఒకళ్ళరక్తం ఒకళ్ళు త్రాగడానికి సిద్ధంగా

వున్నారా' అనేటంత పట్టుదలగా కూచున్నారు. మీర్జాజీ వరుసగా మూడాటలు ఓడిపోయాడు. నాల్గవఎత్తు వైఖరికూడ బాగాలేదు. అనేకసార్లు నిలద్రొక్కుకుని తప్పకుండా గెలిచి తీరాలనే దీక్షతో ఆడుతున్నాడు. కానీ, ప్రతిసారి ఏదో విఘాతం వచ్చిపడుతోంది. ఆటబిగి తప్పిపోతోంది. ఓడిపోయి నప్పుడల్లా కసితీర్చుకోవాలనే అభిలాషకూడా ఎక్కువై పోతోంది. మీర్‌సాహెబు విజయగర్వంతో కూనిరాగాలు తీస్తున్నాడు. మహాభాగ్యం సిద్ధించినట్లు సంతోషిస్తూ చిటికె లేస్తున్నాడు. ఆ చిటికెలు వింటూంటే మీర్జాబళ్ళు మండి పోతోంది. పరాజయంవల్ల కలుగుతుండే దురభిమానాన్ని కనుపించకుండాచెయ్యడానికి ఎన్నివిధాల ప్రయత్నం చెయ్యాలో అన్నివిధాలా చేశాడు. కాని, బాజీబలం తగ్గిన కొద్దీ ధైర్యం సడలిపోతూవచ్చింది.చివరకిమాటామాటాదాక వచ్చింది' "ఏమండోయి, వేసినెత్తుతియ్యకండిమరి...మొదటో ఎత్తువేశారు. మళ్ళీ తీసుకుంటారేం! వెయ్యదలచుకున్న ఎత్తొక్కసారే వేసెయ్యండి......జంతువుమీద చెయ్యల్లా పెట్టుకుని కూర్చుంటే ఏమిటర్థం! మొహరామీద చెయి తియ్యండి. ఎత్తుతోచకపోతే తోచిన తర్వాతే మొహరా మీద చెయ్యివేయండి. ఒకొక్కొక్క ఎత్తేసేసరికి అరగంట అవు తోంది. అది ఆటసబబు కాదు. ఎత్తుకయిదునిముషాలు కన్న ఎక్కువయితే ఓడిపోయినట్లే......మళ్ళీ ఎత్తు మారు స్తున్నారు. ముందా జంతువు నక్కడపెట్టండి."

మీర్ సాహెబు మంత్రి పోతోంది... "నేనింకా ఎత్తు వెయ్యిందే" అన్నాడు.

మీర్జా:- అబ్బే...! ఎత్తు వేసేశారు. ముందు జంతువు నక్కడ పెట్టండి...ఆ ఇంట్లోనే...

మీర్:- ఆ ఇంట్లో ఎందుకు పెట్టాలి? జంతువుమీద చెయ్యి నేను తియ్యిందే?

మీర్జా:- చెయ్యి మీరు ఎప్పుడూ తియ్యరు. ఎంత ప్రళయంవచ్చినాసరే. ఇక ఆట సాగేదేమిటి? మంత్రిపోతోంది. అందుచేత ఈ మోసంచేస్తున్నారు.

మీర్:- ఏమండోయి, మాటలు సరిగా రానియ్యండి. మోసంమీది. జయాపజయాలు దైవాధీనం అన్నారు. మోసం వల్ల ఎవరూ గెలవరు.

మీర్జా:- అయితే ఈ ఆట మీగోడిపోయినట్లే.

మీర్:- నే నెందుకోడిపోయాను?

మీర్జా:- అయితే మీరు జంతువును ఏ యింట్లోంచి తీశారో ఆ యింట్లో పెట్టండి.

మీర్:- అక్కడెందుకు పెట్టాలి? పెట్టను.

మీర్జా:- ఎందుకు పెట్టరు? పెట్టితీరాలి.

తగాదా పెరిగిపోయింది. ఎవరిపట్టువారిదే. ఉభయులూ దిగ రేదు. అప్రస్తుతప్రసంగాలు ఆరంభమైనాయి.

మీర్జా:- ఎవడికైనా పెద్ద తెప్పుడైనా చతురంగం మొహం ఎరుగుంటే ఆట సాంప్రదాయాలు తెలుస్తాయి.

గడ్డికోసుకు బ్రతికేవాళ్ళు చతురంగం మొహం మే మెరుగుదురు? జమీందారైతేనేమి ? జాగీరుంటేనేమి ? ఫామేదా ఎక్కడ నుంచి వస్తుంది?

మీర్ :- ఏమిటీ ? మీ బాబు గడ్డికోసుకు బ్రతికాడేమో ! మా ఇంట్లో తరతరాలుగా ఆడుతున్నాం చతురంగం.

మీర్జా:- వెళ్ళవయ్యా ! చెప్పావు కబుర్లు. గాజీ యుద్దీన్ హైదర్ దగ్గర వంటచేసుకొని కాలక్షేపంచేశారు. ఇప్పుడు పెద్ద జమీందారులై పోయారు. జమీందారు లవడం అంటే అల్లాటప్పా వ్యవహారంకాదు.

మీర్ :- ఎందుకు మీ పెద్దల ముఖానికల్లా మసిపూసుకుంటారు? మీవాళ్ళు వంటలుచేశారేమో కాని, మా వాళ్ళెప్పుడూ పాదుషాసహాపంక్తిని భోజనంచేస్తూనేవచ్చారు.

మీర్జా:- వెళ్ళవయ్యా, ఆట్టే సొరకాయ కోతలు కోయకు. గొప్పకబుర్లు చెబుతున్నావే !

మీర్ :- కాస్త నోరుసంబాళించుకోండి. మాటలు జాగ్రత్తగా రానివ్వండి. లేకపోతే బాగాజరగదు. గుస్సెర్రజేస్తే గుడ్లు తోడేస్తాను! నామర్దామాటలు సహించలేను. ఎవరైనా నాసరే, నాలుక తోడేస్తాను......ఏమనుకున్నావో తడాఖా !

మీర్జా:- నా తడాఖా చూస్తారా ఏమిటి ? అయితే రండి. అయిసాపైసా తేలిపోవాలి.

మీర్ :- ఈ కబుర్లకు జాలైపోయేవాళ్ళెవ్వరూ లేరు ఇక్కడ.

స్నేహితులిద్దరూ కత్తులుతీశారు. అది నవాబులకాలం. తల్వార్లు, పేష్‌కబ్జు, కటార్లూ మనుష్యులవంటిమీదవుండేవి. ఇద్దరూ అవడానికి భోగపరాయణులేకాని పిరికివాళ్ళు మాత్రం కారు. పాదుషాకోసం చావడమెందు కనుకున్నారు కాని తమ వ్యక్తిపౌరుషాన్ని ప్రదర్శించడానికి మాత్రం సంకోచించలేదు. ఇద్దరూ కత్తులుదూసి ఒకళ్ళమీద ఒకళ్ళు దూకేరు. కత్తులు ఝణఝణలాడేయి. 'టప్' మని శబ్దం అయింది. ఇద్దరూ వ్రేట్లుతిని క్రిందపడ్డారు. గిలగిల కొట్టుకొని ప్రాణాలు వదిలేరు.

పాదుషాప్రాణాలుపోతుంటే ఇద్దరికళ్ళనుంచీ ఒక్క కన్నీటిబిందువైనా రాలలేదు. కాని చతురంగంలో మంత్రి ప్రాణంకోసం తమప్రాణాలను అర్పించేశారు.

చీకటి కమ్ముకుపోయింది. చతురంగంపావులు అమర్చిన వమర్చినట్లుగానే వున్నాయి. ఈ వీరులకోసం ఏడుస్తున్నారా అన్నట్లు చతురంగంలోని రాజులు తమతమ సింహాసనాల మీద కూచునే ఉన్నాయి.

అంతా నిశ్శబ్దమైపోయింది. ఆ శిధిలాల్లో పడిపోయిన గోడలు, విరిగిన బురుజులు, కూలిపోయిన రాజులు ఆ శవాలను చూస్తూ తలలువంచుకున్నాయి.

( "ప్రేమచంద్" నుండి. )

# గౌ. ప్పో శ్మ న్యాయం ౧

మధ్యాహ్నం పండ్రెండుగంటలు దాటింది. రాజమహేంద్రవరం జైలు క్వారంటైను ఇన్‌ఛార్జి వార్డరు తాళాలు రిలీఫు వార్డరుకప్పజెప్పి భోజనానికి చక్కాపోయాడు. ఆక్టింగు వార్డరు వెనకాల బ్లాకులో నెత్తిమీదిబుట్ట క్రిందపెట్టి చాపమీద శయనించేడు. కాలేకడుపుకు మండే బూడిదన్నట్లు తహతహలాడే ఆత్మారాముని కింత దేవతాపులుసూ ముద్దా నైవేద్యంచేసి వసారాలో తీరికగా కూచున్నాను. అట్టే ఏదో ఆలోచనలోపడ్డాను. ఇంతలో ఎవరో ఒక యువకుడు నా ఏకాంతాని కడ్డొచ్చాడు. నక్కుతూ నక్కుతూ వచ్చి 'దండం బాబయ్యా' అన్నాడు. అప్పట్లో నే నొక్కడనే రాజకీయఖైదీ నవటంచేత మామూలుఖైదీలు పని కల్పించుకొచ్చి ఏదో పిచ్చాపాటీ మాట్లాడి పోతూవుండడం మామూలే. అంచేత నా ఏకాంతానికి భంగం కలిగించిన ఆ వ్యక్తి ఎందుకొచ్చేడో కనుక్కోవాలనే ఆలోచన నాకు తట్టనేలేదు. నాలుగైదు నిమిషాలదాకా నేను మాట్లాడలేదు.

అతనూ అల్లాగే దీనంగా కూచున్నాడు. "ఏమమ్మా, ఇల్లా వచ్చావు ?" అని నేనే పలకరించాను చివరికి. అతడు వంచిన తలెత్తలేదు. కండ్లవెంట అశ్రువులు రాలుతున్నాయి. ఆ స్వరూపం చూస్తే దైన్యత మూర్తీభవించినట్లుంది. ఆ మనిషి వయస్సు సుమారు 25 సంవత్సరాలుంటుంది. నల్ల రూపైనా కళాకాంతులుగల మొఖం. బెంగచేత కాబోలు దిగాలుపడున్నాడు. బెత్తల్లాటి కళ్లు గుంటలట్టి ఉన్నాయి.

"ఎందుకబ్బాయీ అల్లా విచారిస్తున్నావు? నీ దేవూరు, సంగతేమిటి ?" అని నేను ఓదార్చేను. కాస్త దుఃఖం సంబాళించుకొని "బాబయ్యా, నా గొడవంతా చెపితే పెద్దపురాణం అంతుందండి. మీ దగ్గర కూకుండి ఊసాడుతుంటే వార్డరయ్యేమంటాడో నని గుండెలు పీచుపీచుమంటున్నాయి. కామందులు నాకో ఉపకారం చెయ్యాలి ?..."

కామందులనే మాట వినేసరికి నాకేమిటో అదోవిధమైన వెలపరం కలిగింది.

"అవును కాని, నీలాగే జైల్లోఉన్న నేను నీకేమి ఉపకారంచెయ్యగలను. కాకపోతే అయ్యో పాపం! అనగలనేమో!...అయినా సంగతేమిటో చెప్పు......"

"అంతేకాన బాబూ. ఈ యమధర్మరాజు పట్టణంలో ఆమాత్రం మాటఆసరామాత్రం ఎవరు ? తమరు నాకో సలహా చెప్పాలి. మీరు చదువుకున్నోళ్ళనీ మా కులమోళ్ళంటే మీ కభిమానమనీ ఎదటికొట్లో సావుకారు చెప్పేడు.

అప్పటినుంచీ మీతో మాటాడాలని పెయత్నం బాబూ. నేను చివిలుఖయిదీని. ఇక్కడికొచ్చి పదేడు రోజులైంది. మాది ఎంకటాపురం తాలూకా చిక్కినపాడు గ్రామం. నా పేరు చిక్కినపాటి ఈరడు. మాది పెద్దకులం. మా బాబు సుబ్బడు ఊరికి తలారండి. కులానికి పెద్ద. అతడు చచ్చిపోయి రెండేళ్ళయిందండీ. దాంతో మా కుటుంబం ఎత్తినపడిపోయిందండి. నేను గోచీపెట్టినకాడినుంచీ పెద్దమునిసబుగారి కమతంలోనే ఉన్నానండి. పెద్దమునిసబుకి మా బాబంటే ఎంతో అంత పాణం. మా బాబు సచ్చిపోయాక ఆ మారాజే అభిమానముంచుకొని నన్నొక కంట కనిపెడుతూ వచ్చాడు బాబయ్యా. ఆ మారాజే ఏడ్నర్థంకింద నాకు పెళ్ళిచేసేడండి. పెళ్ళికి నాఎల్లికి రెండుకాసుల పట్టెడ సదివించాడు బాబయ్యా. మారాజు, మహరాజు, ఎల్లి కాపురానికొచ్చాక మారాజుతో మనవిచేసుకుంటే పుట్టిపందుము గింజలు, చాపు, చీరె, నలభై రూపాయలు జీతం చేసేడండి. మా కర్మంకొద్దీ అల్లాంటి జాలిగుండె మారాజు అర్ధంతరంగా స్వర్గానికెళ్ళిపోయాడండి. దాంతో బాబయ్యా! మాపాపం బద్దలైపోయింది. చిన్న మునిసీబుకు పెత్తనంవచ్చింది. ఊరుఊరంతా గొల్లుమనిపోయారు. పాలికాపోళ్ళకి బత్తేలివ్వడు. బాకీదార్లను బావురనిపిస్తున్నాడు. నాదారోళ్ళ నసలే మెసలనియ్యడు బాబయ్యా. మారాజు పెద్దమునిసీబు గర్భవాసాన్నెల్లా పుట్టాడోకాని జాతేటో ఎరగడయ్యా. పైగా చెయివాటుతనంకూడాను.

చెపితే ఇస్తారంగా ఉంటుంది కాని. పెద్ద మునిసీబు పోయి నప్పటినుంచి ఊరు ఊరందరి ఉసురోసుకుంటున్నాడు..."

"అసలు సంగతేమిటో చెప్పు" అని నేను తొందర పెట్టేను.

"అదేనండి బాబయ్యా. చిన్న మునిసీబు నన్ని యమ లోకంలో పారేయించాడండి. పెద్దమునిసీబు సల్లంగున్న రోజుల్లో మాబాబు మాచెల్లమ్మ పెళ్ళికి ఇరవైరూపాయ లప్పుతీసుకున్నాడు. ఇక నాలుగునెల్లకి సచ్చిపోతాడనగా అప్పంటే ఆడింట్లో కుక్కయి పుట్టాలని, పదిరూపాయలట్టికెళ్ళి చేతులోపెట్టి ఇక నిచ్చుకోలేను బాబయ్యా అన్నాడు. అదే పోనీరా అన్నాడు పెద్దమునసీబు. అప్పు తీరిపోయిందిగదా అని ఎంతో అంత సంతోషించాం బాబూ. చిన్నమునిసీబు పెత్తనంవచ్చింది. మళ్ళీ మా కొంప మునిగిందండి. మూడే ళ్ళయినాక పాత కాగితం బయటపెట్టి అదేటో కాని వడ్డీకివడ్డీ కట్టి మొత్తం ఏభై రూపాయలు పై చిలుకు బాకీ తేల్చేడండి. బాబయ్యా నాకే గొడవ తెలవదు. కరుణించమని కాళ్ళ మీదపడ్డే మునిసీబుకు కరుణలేకపోయింది. కోర్టులో దావాచేసి డిక్రీపొందేడండి. సావుకా రెంకటప్పయ్యదగ్గిర పెళ్ళినాడు పెద్దమునిసీబు చదివించిన పట్టెడ తాకట్టెట్టి ఎల్లి ముప్పయిరూపాయలు అర్ధణావడ్డీకి తెచ్చి మునిసీబు దోసిట్లో పోసింది. అదీ పుచ్చుకుని, బాబయ్యా! నన్ని జైల్లో పెట్టించా డండి..."

ఒక్కసారి ఆ కీనుడిహృదయం పగిలిపోయినట్లయింది. ఏడుపు ఆగింది కాదు. ఏదో చెప్పబోతాడు కాని మాట రావడం లేదు. అయిదునిమిషాలదాకా అలాగే ఉన్నాడు. నాకు అతన్నేమీ అడ్డుపెట్టడం యిష్టంలేకపోయింది. ఆఖరుకు—

"అబ్బాయీ, ఈకథంతా వింటే ఇది డబ్బుకాపీనం కొద్దీ చేసిన పనిలా కనుపించడంలేదు. ఇదేదో కావేషంమీద జరిగిన పనిలా కనిపిస్తుంది. ఏమంటావు?" అన్నాను.

ఆ యువకుడు దుఃఖాన్ని సంబాళించుకొని ఇల్లా అన్నాడు.

"అవును బాబయ్యా! యీ పుట్టిములక్కంతకీ కారణం ఎల్లి. మాఎల్లి సత్తెకాలపు మనిషి. అందరిలాంటిది కాదు బాబయ్యా. నామాటే దానిమాటండి, దానిమాటే నాదండి. నామనసే దానిమనసు, దానిమనసే నామనస్సండి. మాకాపురం చూచి యిరుగు పొరుగోళ్ళంతా చిలకా గోరింకా అని సంబరపడుతుంటారండి. బాబయ్యా చిన్నమునిసీబు నూ కాపురంలో బొగ్గులోసేడండి. మాయదారి బెమ్మదేవుడు మమ్మల్ని చూచి ఓర్వలేకపోయాడండి. మా కర్మం కాకపోతే ఏలకు ఏలు కరుసుచేసి తెచ్చుకున్న ముక్కారుముద్దుల ఆడోళ్ళు కొంపలో రంభల్లాగుంటే చిన్నమునిసీబుకి మాఎల్లిమీద కన్నెందుకు పడాలి బాబూ! అదీ మాకరమమే!" అంటూ మొఖంమీద చేతులెట్టుకుని ఏడ్చేడు వీరయ్య.

"వీరయ్యా ఏడవకు, ఏంలాభం ? మాఎల్లమ్మను మునసబు ఏమన్నా చేశాడాఏటిటి ?"

"అవునండి మారాజా. ఒకరోజున ఎల్లి నేనూ దచ్చిణ పొలంకాడ కాపు పడుకున్నామండి. చిన్నమునిసీబు జాము రేతిరికాడొచ్చి తూరుపుపొలంలోఉన్న సుబ్బిగాడిని తీసుకు రమ్మనమని పంపేడండి. నేనల్లాగెళ్ళేసరికి ఎల్లితో సరసాలా రంభించాడండి. అదెన్నినీతులు చెప్పినా ఇనిపించుకోక దగ్గర కొచ్చేతలికి "ఈరయ్యబావ చంపేత్తాడు సుమా" అని బెద రించి విదిలించుకొని పారిపోయిండి. నేను సుబ్బిగాడికోసం వెతికి వెతికి వచ్చేతలికి అక్కడ ఎల్లీ లేదు, మునిసబూలేడు. నా కేటో భయమేసి ఇంటి కెల్లేతలికి ఎల్లి ఏడుత్తూ తొం గుంది. ఏటి సంగతనడిగేతలికి ఎల్లి బావురుమంది. కూసేపటికి సంగతంతా యినిపించింది. మునిసీబు యెడుతూ యెడుతూ "వీరయ్య సంగతి కనుక్కుంటాలే. నాలుగు రోజుల్లో ఈతడ్ని ఇక్కడెక్కడా లేకుండా చేస్తాను. అప్పు డెక్కడి కెడతావో చూస్తానుకాదూ" అన్నాడుట. ఆ కబురుతో ఎల్లి గుండెల్లో రాయడిపోయింది. "బావా నీపాణ మెక్కడ తీస్తాడో గందా" అని బావురని ఏడ్చింది. దాని కాకబు రీకబురు చెప్పి ఊరుకుండబెట్టేతలికి నా తాతల్దిగొచ్చారు. మునిసీబు బాకీ ఎల్లాగో పారేసి మరొకళ్ళదగ్గర నౌఖరీచేద్దామంటే ఎక్కడా ఎర్రిటేగాని అప్పుట్టలేదు. అతగాడేడిపించిన ఏడిపింపుకి ఒహ ప్పుడు కొడవల్లుచ్చుకు పీకె ముంజికాయలా తెగేద్దామని

పించింది. కాని మారాజు పెద్దమునిసీబు కళ్లల్లో మెదిలేతలికి 'ఛీ' అనిపించి ఊరుకున్నాను.........బాబయ్యా, ఇంతకీ నా ఎల్లిసల్లంగుండాలిగందా! ఆవెంకటేశ్వరసోమివారి దయ. చిన్న మునిసీబు నా ఎల్లి నేంచేత్తాడోగందా! ఈరడ్ని జైలు కంపేత్తే, ఎల్లికి బువ్వలేకుండా చేసి సాధీనంచేసుకోవచ్చునని ఎత్తేత్తాడు బాబయ్యా.......... ఎదవ....... అయితే పన్నెం మహాపాయలు పైచిలుకే జైల్లోపెట్టించడానికి రూల్సు న్నాయా బాబూ?"

"ఓయిపిచ్చివాడా! రాజుతలుచుకుంటే దెబ్బలకొ్కదవా? డబ్బున్నవాళ్లు కక్షవహిస్తే రూల్సుకు లోటేమిటి? అవి ఎల్లా పడితే అలాగే సాగుతాయి. తిరుగుతాయి"."నాయనగారూ నన్నీ యమలోకంలోంచి బయటపడేసేమార్గం చెప్పాలి. ఎల్లిని తలుసుకుంటే కంటికి కునుకులేదు. గంజి తాగుదా మంటే ఇసంలాగుంది బాబూ. సదూకునోళ్ళకి దీనికిటుకు లన్నీ తెలుస్తాయంటారు. బాబయ్యా, బతికి బాగుంటే నా ఎల్లీ నేనూ మీ రుణం తీరుసుకుంటాము..............బాబూ మన దేవూరు? ..............."

ఇలా అంటూండగానే టంగున గంటకొట్టేరు. తాళాలు గణగణలాడేయి. తాళాలచప్పుడు వినబడేసరికి వీరయ్య అమాంతంగాలేచి పరుగెత్తుకెళ్ళిపోయాడు.

* * * * *

వీరయ్య వృత్తాంతం విన్నాక అవ్వేళ నాకు మనసు మనసులో లేదు. ధనికులైనవాళ్ళు తమ స్వప్రయోజనం కోసం చట్టాల నెల్లా మడదీసి ఉంగచుడతారా అని ఆలోచించేసరికి ఒళ్ళంతా చీమలు పాకినట్లయిపోయింది. పన్నెండు రూపాయల పైచిల్లరకు మనుష్యుని స్వేచ్ఛను లాగేసే చట్టం, దాన్నమలుజరిపిన మనుష్యుల అమానుషత్వం తలుచుకుంటే రోతపుట్టింది. దీనుడైన వీరయ్యకేమైనా సాయం చేయగలనేమోనని ఎంత ఆలోచించినా ఏమీ మార్గం కనపడలేదు. ఆ రాత్రంతా ఆదీనుడిస్వరూపం కళ్ళకు కట్టినట్టే ఉంది. మరునాడు 12 గంటల బండిమీద నన్ను రాయవెల్లూరు జైలుకు కమానెత్తేరు. వెళ్ళేటప్పుడు వీరయ్య కనపడతాడేమోనని చూచాను కాని లాభంలేకపోయింది.

ఆవేళ రైల్లో వెడుతుంటే నన్నుంచినబండీల్లోనే చిన్నప్పుడు నాతో చదువుకొన్న మిత్రుడొకడెక్కాడు. అతనేదో తెల్లదొరలకంపెనీలో రెండొందల రూపాయల ఉద్యోగం చేస్తున్నాడు. అతను నన్ను పరామర్శించి ఏమన్నా కావాలా అని అడిగేడు. నేను ఖైదీననీ, ఏమీ పుచ్చుకోకూడదనీ చెప్పేను. సరిగ్గా ఆసమయానికి వీరయ్యసంగతి జ్ఞాపకానికొచ్చి ఆ గాథంతా అతనికి చెప్పి ఏలాగైనా వీరయ్య విడుదలయ్యేటట్లు సాయంచెయ్యమన్నాను. అల్లాగేనని ఆ మిత్రుడు నిడదవోలులో దిగిపోయాడు. దానితో నాకు కొంత శాంతి కలిగింది. అంతవరదాకా వీరయ్యవృత్తాంతం, అతని దీన

స్వరూపం, జ్ఞాపకానికొచ్చేవి. ధనికుల దౌర్జన్యం తలుచుకొని ముందు పళ్ళు కొరికినా నిస్సహాయత్వంవల్ల లోకమింతేనను కొని చప్పరించేసి సర్దుకొనేవాడిని. కాలక్రమేణ వీరయ్య సంగతి నా జ్ఞాపకంలోంచి తప్పిపోయింది.

*　　*　　*　　*

రెండు సంవత్సరాల అనంతరం ఆజైలునుంచి ఈ జైలుకు, ఈ జైలునుంచి ఆ జైలుకు తిరిగి, కోయంబత్తూరు చేరుకొన్నాను. అక్కడ నన్ను ఒకమూలబ్లాకులో ఒంటరిగా ఉంచేరు. ఆబ్లాకులో రెండుపెద్ద రావిచెట్లున్నాయి. ఆ రావి చెట్లక్రింద పదేనురోజుల కొకసారి ఖయిదీలసభ జరుగుతుంది. ఒకరోజు ఆదివారం మధ్యాహ్నం సభ మావేశమైంది. ఒక ముసలాయన అరవతెలుగులో కామక్రోధాల్ని గురించి ఉప న్యాసం బనాయిస్తున్నాడు. మంచినీళ్ళకొళ్ళాయి దగ్గర నేను నిలబడి అరవతెనుగువింటూ ఆనందిస్తున్నా. అక్కడ దగ్గరే ఒకమనిషి తలవంచుకుని కన్నీరు కారుస్తున్నాడు. ఏమిటా ఇతనిల్లా ఏడుస్తాడని నేను దగ్గర కెళ్ళి పలుకరించాను. అతను తలెత్తి చూచాడు. చూచీ చూడడంతోనే ఆమనిషి నెక్కడో చూచినట్లు నాకు స్ఫురించింది. ఎక్కడా అని ఆలోచన ప్రారం భించేసరికి ఛటుక్కున లేచి నిలబడి అతడు “బాబయ్యా దండాలు...ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు? నేను వీరడ్ని బాబూ” అని రెండుచేతులూ పట్టుకున్నాడు. నేను ఆశ్చర్యంతో అల్లాగే నిలబడిపోయాను. వీరయ్య కండ్లవెంట బొటబొటా కన్నీటి

బిందువులు రాలేయి. నాకు వీరయ్యకథంతా జ్ఞాపకానికొచ్చింది. ఆనాడు రాజమండ్రిజైలులో ఒక్కసారే మామూలు బట్టలు కట్టుకున్నప్పుడు అతగాడిని చూచేను. యీ రోజున మల్లెలాగు, కోతిటోపి పెట్టుకుని కనబడేసరికి పోల్చలేక పోయాను. మేమిద్దరం ఆస్థితిలో ఎంతసేపున్నామో చెప్ప లేను. కాని సభముగిసింది. కుశలప్రశ్న వేసుకుంటుంటే ఖైదీలు చుట్టూ చేరేరు. వార్డరొచ్చి 'ఫైల్ ఫైల్' అంటున్నాడు. మెల్లగా ఆ వార్డరుతో వీరయ్య మావూరువాడేనని అతని క్షేమసమాచారాలు తెలుసుకోడానికి కాస్సేపు వదలిపెట్టమని చెప్పేను. "పైవాళ్ళు చూస్తే మాటొస్తుందండీ" అంటూ నే పైకిచక్కాపోయాడు.

నేను వీరయ్యను చెట్టుక్రిందకూర్చోపెట్టి—

"ఏమిటి వీరయ్యా ఇల్లానచ్చావేమిటి?" అన్నాను.

"ఏం చెప్పను బాబూ? మీరు చేసిన ఉపకారం నా కప కారమైంది."

"నేను నీకుచేసిన ఉపకారమేముందీ?"

"ఉపకారం కాదూ బాబయ్యా! మీరు వెళ్ళిన వారం రోజుల్లో నాకు విడుదలైంది. ఎల్లి డబ్బు కట్టేసింది కామో వనుకున్నాను. కాని నేను తీరా ఊరెళ్ళి తెలుసుకుండేటలికి యెంకటాపురం పేడరుగారు యిడుదలచేయించారనీ, ఆరి కెవరో మీ స్నేహితులు కబురుచెప్పేరనీ తెల్సింది. అప్పట్లో మీపాదాలకి మొక్కుకున్నాం బాబయ్యా. మాఎల్లి మీకెన్నో

దండాలుపెట్టింది. మీ దేవ్వూరో ఎవరో తెలుసుకోలేదని ఎల్లి నన్ను చీవాట్లెట్టింది......"

అప్పటికి వెల్లూరు వస్తుంటే కనబడ్డమిత్రుడితో నేనీ విషయం చెప్పినసంగతి జ్ఞాపకానికొచ్చి అత నింతపని చేసినం దుకు చాలా సంతోషపడ్డాను.

"అయితే వీరయ్యా! మళ్ళీ ఇల్లా ఎందుకొచ్చేవోయి" అని అడిగాను.

"అదే బాబు గొప్పోళ్ళ మహిమ. చివిల్లోంచి బయట పడేతలికి మరింత కొంపమీదకొచ్చింది. చిన్నమునిసీబుకి ఎల్లిమీంద బెముపోలేదండి. నేనుజైల్లో ఉన్నప్పుడు ఎల్లితో సరాగాలాడితే అది పొమ్మందంట. అతగాడి బాధపడలేక అది పుట్టింటి కెళ్ళిపోయిందండి. నేనొచ్చాక కొద్దిరోజులకి కనుచీక టేల ఎల్లి గుడిసెలో కూడ్వొండుతుంటే చిన్నమునిసీ బెల్లి యేసా లారంభించాడండి. నేను చొప్పమోపెత్తుకొచ్చేతలికి అప్పుడే మునిసీబు దురమార్గానికి సిద్ధమవుతున్నాడు. ఆతలికి నావళ్ళు మండిపోయింది బాబయ్యా. ఎల్లి 'ఈరయ్యాబావో' యని మీదపడిందండి. మరింక కోపంఆగలేదు బాబూ, చేతిలో వున్న కొడవలితో బుజంమీద ఒక్కపెట్టేసేతలికి మునిసీబు నేలకు పికారైపోయాడు. రక్తం వరదలై పోయింది. తర్వా తేం జరిగిందో నాకు తెలవదు. మర్నాడు ప్రొద్దున్న నన్ను అరెస్టుచేసి కొట్లోపెట్టేరు. చిన్నమునిసీబుకు పాణంపోలేదు కాని బాబయ్యా, చెయి తెగిపోయిందండి. కొన్నాళ్ళయ్యాక ఏలూరు

జడిజీకోరుటులో కేసుజరిగిందండి. జడిజీగారిదగ్గరున్న దున్నట్లు చెప్పేశాను బాబయ్యా! పీడర్లేవో అబద్ధాలు చెప్పమన్నారుగాని మనసొప్పలేదు. చిన్నమునిసీబు వెయ్యి రూపాయలు ఖర్చుపెట్టి ప్లీడర్లకెట్టేడండి. చివరికి పదేళ్ళ శిక్షేశారండి నాకు. నాపెళ్ళాన్ని రక్షించుకోడానికి నేనడ్డొడితే నాకు పదేళ్ళు శిక్షేయడం ఏమిన్యాయం అని కోర్టువారి నడిగేను. పోలీసులొచ్చి నోరునొక్కేశారు. బాబయ్యా నాపెళ్ళాన్ని దుర్మార్గంచేసిన మునిసీబుకేమీ శిక్షలేదు కాని బీదోడిని కనుక నాకు పదేళ్ళనరకమా? ఏంన్యాయం బాబిది? డబ్బుందిగదా అని పీడర్లూ ఆరిపక్షమే, పోలీసు లారిపక్షమే. మా కరమ మింతే కాబోలు.

"చివరికి శిక్షేసి రాజమండ్రినుంచి ఈ ఊరు తీసుకొచ్చే రండి. ఇక్కడ ఫాక్టరీలో చచ్చేటట్లు చాకిరీచేస్తే ఎగటొచ్చే పులుసన్నం పెడ్తున్నారు. మారాజులు మీరెల్లా గడిపేరో కాని, బాబయ్యా. ఎల్లేమయిందో తెలవడంలేదు. శిక్ష చెప్పిన రోజున హానేదుపుమాసి కోరుటు కోరుటంతా ఏడ్చిందండి. కాని ఆలించే పెభువు లెవరు బాబూ? బాబయ్యా మీవిడుద లెన్నాళ్ళుందండీ? మీకు విడుదలైతే ఎల్లి సంగతి కనుక్కుం టారని ఆశండి బాబూ......మరి..." అంటూ ఇంకా చెప్పబోయాడు వీరయ్య. భోజనంబిగులు . బుఃయ్యిమంది. వార్డరు 'ఫైల్' అన్నాడు. వీరయ్య వెళ్ళవేక వెళ్ళలేక వెళ్ళి పోయాడు. మళ్ళీ నా కత డెప్పుడూ కనబడేలేదు.



నా విడుదలైనతర్వాత వెంకటాపురం ప్రాంతాల్లో ఈ కేసుసంగతి విచారించగా వీరయ్య చెప్పిన గాథంతా నిజమే. ఎల్లమ్మ వీరయ్య నొదిలిపెట్టి ఉండలేకో, పొట్టగడవకో, మనసుబాధ పడలేకో ఆత్మహత్య చేసుకుందట. నాటికీ నేటికీ ధనికులైనవాళ్ళు బీదల తగూల్లో పిలవకపోయినా కలుగచేసికొని న్యాయం చెప్పబోతూంటే నాకు వీరయ్య వృత్తాంతం జ్ఞాపకంవస్తూఉంటుంది. అల్లాంటప్పుడు "గొప్పోళ్ళన్యాయం ఇంతేకామోసు" అన్న అతని ముక్కలు నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూ వుంటాయి.



వీరయ్యలాంటివాళ్ళకు నిజమైనన్యాయం కలిగించడమే మన ప్రభ.

[ఇది కేవలం కల్పితంకాదు. కథావస్తువు చాలవరకు నిజం. పేర్లు మాత్రం కల్పితములు]

# గొప్పోళ్ళ న్యాయం ౨

రుద్రంరాజుగారు జల్లిసీమకల్లా పేరెళ్ళిన మోతుబరి. ఇంట్లోనూ వంట్లోనూ కూడా సామంతంగలవాడవడంచేత ఆపరగణాలో కల్లా పేరు మోసేసు. రుద్రంపాలెం గ్రామం ముప్పాతిక మూడువంతులు ఆయనదే. ఒకప్పుడు వారి సంసారం సామాన్యమైనదేకాని, రుద్రంరాజుగారి స్వార్జితం 500 ఎకరాలు. పైగా లక్షరూపాయలు ఖాతా. ధనవంతుడికి గౌరవాలకు లోటేమిటి? పలుకుబడికి తక్కువేమిటి? తాలూకాబోర్డు నంబరు. గ్రామ పంచాయతీ ప్రెసిడెంట్. "శంఖుబడితేనేగాని తీర్థంకానట్టు" ఆచుట్టుపక్కల ఏవ్యవహారమొచ్చినా పెదరాయుడు (రుద్రంరాజుగారి నందరూ పిలిచే పేరు.) లేనిదే పరిష్కారంకాదు. ఏ వ్యవహారంలోనైనా కలుగచేసుకోడానికి పిలవాలనే పట్టుదలకలవారు కారు. పెదరాయుడు మంచి వ్యవహర్త. వడ్డీలకు వడ్డీపెంచి భూములు వ్రాయించుకోవడంలో మహామంచి మెళకువ వుంది. కాని ఆస్తి అవుపోసనపట్టినా మనిషికి పిసరంత నొప్పికలిగించని సౌమ్యత, నేర్పరితనం కలవాడు.

రుద్రంరాజుగారికి సిరీ సంపత్తు అన్నీ ఉన్నాయి. కాని ఆయనకల్లా ఒక్కటేకోరిక. దక్షిణంవైపున పాటకాలువను చేరివున్న సుబ్బరాజుగారి నాలుగెకరాల కొండ్రా ఎల్లాగో ఒహాలాగున కలుపుకుంటే ఆ దిక్కంతా ఆయన కేకఖండికై పోతుంది. దాంతో ఆయనకోరిక తీరిపోతుంది. సుబ్బరాజు గారు సామాన్య సంసారి. ఒంటరిగాడు. తన నాలుగెకరాలు పండించుకు తినడమే కాని, మరొకజోలీ శొంఠీ ఆయనకక్కర లేదు. పొలమేమిటో ఇల్లేమిటో అంతే; ఊళ్ళో ఉన్నట్లే కనుపించడు. అందుచేత ఆ కాస్త కొండ్ర ఆపోసనంపట్టడానికి పెద రాయారు నాలుగైదేళ్ళనుంచి ప్రయత్నిస్తున్నా సాధ్యపడడం లేదు. అప్పుసప్పులకెక్కని కారణంవల్ల ఆక్రమణ కవకాశం చిక్కలేదు. ఇక విధిలేక 4 ఎకరాలకు మరొకచోట కాలువ చివర 6 ఎకరాలు పిరాయింపిస్తామని కూడా బేరంపెట్టా డు. కాని అచ్చివచ్చిన పొలమును ఆడకూతుళ్ళభ్యంతరపెట్టడం చేత. అన్నివిధాల వనరైనపొలం చేతులార ఎందుకువదులు కోవాలనీ, సుబ్బరాజుగారు సుతరాం వప్పుకోలేదు.

ఎల్లాగో అల్లాగు ఈ కోరికతీరితేగాని పెదరాయారికి మనశ్శాంతి లేదు. పంచాయితీ గొడవల్లోనూ. ఉమ్మడి చం దాలవిషయంలోనూ, ఎందులోనూకూడా ఎంతకవ్వించినా సుబ్బరాజుగారు బెసగలేదు. “నన్ను ముట్టుకోకు నా మాల కాకి” అన్నట్లే ఉన్నాడు. పెదరాయారికి పేచీకెంతమాత్రం సావకాశమివ్వలేదు.

ఇల్లా చాలాకాలం గడిచింది. ఆసంవత్సరం రుద్రపాలెం గ్రామస్తులు వెయ్యిరూపాయలు చందా వేసి నీటికాసుల డిపార్టుమెంటువారికి– అంటే డి. పి. డబ్లియు ఉద్యోగులకు–కట్నం చదివించి దాళ్వాపంటకు అనుమతిపొందేరు. తెల్లవారుఝామున నీ రొస్తుందనగా రైతులంతా రాత్రే హడావిడిపడ్డారు. సుబ్బరాజుగారిపొలం పంటకాలువకు చేరే ఉండడం చేత ముందువంతు వారిది. వారి కాడిగట్టుకు చేరి ఉన్నదంతా పెదరాయూరిపొలమే. రుద్రంరాజుగారు దక్షిణపొలానికి నీరెట్టడానికి పదిమంది పాలేళ్ళను పంపేరు.సుబ్బరాజుగారితో ఢీకొడానికి మంచి వీలుదొరికిందికదా అని పెదరాయూరు పాలేళ్ళతో సుబ్బరాజుగారిపొలంగట్టు పొడిచేసి నీరెట్టమన్నాడు. ఏదైనా వస్తే తను కాసుకుంటానని అభయమిచ్చేడు. నిషాఖర్చుకి నాలుగుడబ్బులు చేతిలో పెట్టేడు.

తెల్లవారుఝామున నాలుగు గంటలకు కాలు వందుకుంది. సుబ్బరాజుగారు, ఆయన కూలి మనిషి కలిసి నీరెక్కించుకొంటున్నారు. ఇంతలో కాస్త ఏమరేసరికి పెదరాయూరి పాలేళ్ళొచ్చి గట్టుపొడిచేసి నీరు తమ పొలంలో కెట్టుకున్నారు. ఇదేమన్యాయమని అడగొస్తే "చాల్లేవయ్యా చేశావు ఎగసాయం! అవతల ఆకుమళ్ళెండిపోతుంటే ముందుండి మెల్లగా తడుపుకుంటూ కూచున్నావూ! సమర్థించుకోలేకపోతే పొలం అమ్ముకుపోవాలి. అంతేకాని నీకోసం మిగతావాళ్ళు ఆకెండబెట్టుకుంటారటయ్యా" అంటూ నలుగురూ నాలుగువైపులా

దుయ్యబట్టేరు. సుబ్బరాజుగారు గదమాయించేసరికిపాలేళ్ళు మీదకొచ్చి తోసేశారు. రాజుగారికి అరికాలుమంట నెత్తి కొచ్చింది. చేతిలోని ములకాలకర్ర తిరగేశాడు. పడిమంది చెలరేగి రాజుగారిని దిట్టంగా కొట్టేరు. అయినా సుబ్బరాజు గారు చిన్ననాటి కర్రసాముసత్తా చూపించాడు. నలుగురు పాలేళ్ళు నేలకు పీకారయారు. మరికొందరు పారిపోయారు. ఆఖరుకు ఆయన కే కణతదగ్గర దెబ్బతగిలి క్రిందపడ్డాడు. రక్తం కాలువకట్టింది. స్పృహతప్పింది.



ఊళ్ళోకి కబురెళ్లింది. పెదరాయూరు కారాలుమిరి యాలునూరుతూ కరణం మునసబులను హాంగుచేసుకొని సిద్ధమైనాడు. సుబ్బరాజుగారి దగ్గరబంధువులూ వచ్చారు. స్పృహతప్పినవారికీ, గాయాలు తగిలినవారికీ చికిత్సలుచేశారు. నులకమంచం సవారీలమీద దగ్గరున్న లోకల్ ఫండు ఆసుపత్రికి పంపేరు.



పెదరాయూరికిదీ అవకాశం. ఆయనవథకంపారింది. సుబ్బరాయూరు పాలేళ్లుకదా అని లోకువచూసి నీరుకట్టుకు నే వాళ్ళ కడ్డొచ్చి చావకొట్టేశాడని ఫుకారు రేగింది. రుద్రం రాజుగారిఎత్తే యిది. దానికి తగిన సాక్ష్య సంపర్కాలన్నీ సిద్ధమైనాయి. సుబ్బరాజుగారికి తగిలినదెబ్బలు తేలికైనవని పాలేళ్ళదెబ్బలు మోాపైనవని ప్రమాదకరమైనవని సర్టిఫికెట్లు

పుట్టేయి. పెదరాయరూరు సంచి తెగ్గోస్తే ఇదెంతపని! కరణం మునసబులు పోలీసులకు బకీరు వ్రాసేరు. మధ్యాహ్న మయ్యే సరికి పోలీసులు వచ్చేరు. ఇనస్పెక్టరుగారికి విందు పెదరాయా రింట్లోనే. విందులతర్వాత తాంబూలాలు ముట్టేయి అధికారులకు.

సుబ్బరాజుగారిమీదా పాలేళ్ళమీదాకూడా దొమ్మీ కేసు పెట్టారు. పోలీసులు అందరిని సబుజైలు కంపేరు. రుద్రంరాజుగారిజామీనుమీద పాలేళ్ళంతా బయటపడ్డారు. పరువుగలపేద సుబ్బరాజుగారిమాట తలపెట్టే నాధుడేలేడు. అతను ధనికుడూ కాడు. ధనికుల ప్రాపకమూ లేదు. ఇంట్లో ఆడకూతురు ఆముద్దాకొద్దీ బంధువులసహాయం అడిగింది. సామంతుడిమీద గడెక్కి కక్షకట్టడాని కెవరు ముందు కొస్తారు? ఊళ్ళోప్లీడరువేటుచేసే పంతులు అంటున్నాడు. లోపాయికారీగా శల్యసారథ్యం చేయడానికి పెదరాయరూరు దగ్గర పెద్దనోటుతిన్నాడు. అధమం వెయ్యిరూపాయలైతేనే కాని కేసులోంచి బయటపడడం సాధ్యంకాదని జైలులో సుబ్బరాజుగారికి, ఇంట్లో ఆడవాళ్ళకీ కూడా బెదురెట్టేడు. ఆరునెలలలో తేల్తే అదృష్టవంతులమే; అలక్ష్యంచేస్తే ఆరేళ్ళదాకా పడొచ్చునని గుండెల్లో రైళ్లు పరుగెత్తించాడు పంతులు. వాళ్లపాలిటి దైవమని నమ్మేరు. నాలు గెకరాలు కొంౘ్రా తణకాపెట్టించి వెయ్యిరూపాయల అప్పు

ఇప్పించాడు పంతులు. ఋణమిచ్చింది లోపాయికారీని రుద్రం రాజుగారే. పేరుమాత్ర మింకొకళ్లది.

♦ ♦ ♦ ♦

కేసు నడిచింది నాలుగునెలలు. పంతులు బత్తెఖర్చులకీ, సాక్షులసాదర్లకీ, ప్లీడర్లఫీజులకీ, బంట్రోతుల నజరానాలకీ, ఆఫీసర్ల సత్కారానికీ ఎనిమిదివందలరూపాయలు ఆరిపోయాయి. చివరికి మేజస్ట్రేటుగారు పాతేళ్ళమీద కేసుకొట్టేసి సుబ్బరాజుగారికి మాటవరుసగా మూడుమాసాలు శిక్ష వడ్డించాడు. జామీనుమీద విడుదలచేయించడానికి అప్పీలుకి మిగతాసొమ్ము ఖర్చయింది. పంతులుకి ఈనాం ఇంకా మిగిలే ఉంది. అప్పీలుకోర్టులో విడుదలై ఇంటికొస్తే, కొంపలో కుండలు డింకీలుకొడుతున్నాయి.

♦ ♦ ♦ ♦

సుబ్బరాజుగారికి బాగా కసెక్కిపోయింది. నడివీధుల్లో పెదరాయారు మీసాలు దువ్వుతున్నాడు. వ్యవసాయం మీద వెనుకటిశ్రద్ధ తగ్గింది. అప్పంటే వెనకటిలాగున వెనుకాడడంలేదు. మరి అయిదువందలు అప్పుతెచ్చేడు. పెద్దరాయూరుమీద పంచాయితీలో పోటీపెట్టేడు. పిటీషను లిప్పించాడు. ఒకలేంవిటి త్రాగుబోతుల్ని కూడా దగ్గరకు చేర్చాడు. ఇంతకీ పంతులుపుణ్యాంపుచ్చింది. అప్పు పాపం పెరిగినట్లు పెరిగింది. రెండువేలు దాటింది. తణఖాదారు తొందరపెట్టేడు. ఎకరం వెయ్యిరూపాయలుచేసే సుక్షేత్ర

మైన భూమి అయినకాడి కమ్మేశాడు. లోపాయికారీగా పెదరాయూరే కొనుక్కున్నాడు. ఆయనపథకం పారింది. కోరిక తీరింది. సుబ్బరాజుగారికి అప్పుపోతే మిగిలింది దరిద్రం.

... ... ... ...

సుబ్బరాజుగారికి మతిపోయింది. వీధులవెంట బికారిగా తిరుగుతున్నాడు. "గొప్పోళ్ళ సందర్నీ గోతిలో వేస్తాన్" అంటూ సాముచేస్తున్నాడు. కుటుంబ మేమైందో తెలియదు. పెదరాయూరింటిముందున్న రావిచెట్టు క్రింద చింకిచాప, కర్రలతో ఆయన మకాం. లోకానికంతా సుబ్బరాజు మూర్ఖుడు. ఉన్మాదుడు. డబ్బు తగలేసుకున్న బుద్ధిహీనుడు. దక్షిణంవైపు పొలం ఏకఖండికగా చేసుకోవడానికి, పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, పెద్దమనిషి, రుద్రంరాజుగారిప్లా నింతపని చేసిందని విశాల ప్రపంచానికి తెలియదు. తెలిసినా బిగ్గరగా అనడానికెవరికీ నోరులేదు. అన్నా చెల్లదు. గుప్‌చప్. పెదరాయూరు పెద్దమనిషే!

... ... ...

ఇదీ గొప్పవారి న్యాయం, ధర్మం, పలుకుబడీ. గొప్పోళ్ళసందర్నీ గోతిలో వేస్తాన్ అని సాముచేసే పిచ్చి సుబ్బరాజుహృదయం ఎంత కుమిలిందో ఎవరికి తెలుసు!

—:o:—